# గజపతులనాటి గాథలు

(రెండవ భాగము)



రచన:

బులుసు వేంకటరమణయ్య



ప్రచురణ:

బుక్‌మన్స్ : : మద్రాసు-7

2

మొదటి కూర్పు:
నవంబరు 1955

*



## శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి

రచనలు

| | | | |
|---|---|---|---|
| 1. అభిషేక నాటకము | ... రు. | 1 | 8 |
| 2. గజపతులనాటి గాథలు - 1. | | 1 | 0 |
| 3. ,, ,, - 2. | | 1 | 0 |
| 4. నా దక్షిణ దేశయాత్రలు ... | | 1 | 0 |
| 5. అలంకార వాఙ్మయ చరిత్రము | ... | 2 | 0 |

*

ముద్రణ:
స్వతంత్ర ప్రెస్,
మదరాసు - 2.

# మనవి మాటలు:

విజయనగర సంస్థానానికి చెందిన గజపతి మహారాజులకు సంబంధించిన కథలు కొన్ని శ్రీ బులుసు - వేంకట రమణయ్యగారు వ్రాసినవి - యిదివరకు ప్రకటించాము. అవి ప్రజల ఆదరాభిమానాలను చూరగొనడంచేత - మరి కొన్ని కథలను ఇప్పుడు రెండో భాగంగా ప్రకటిస్తున్నాము. ఇంకా మరికొన్ని కథలు వున్నాయి. వాటిని కూడా త్వరలోనే ప్రంకటించాలనే సంకల్పం వున్నది. ఇప్పటి కథానికల్లో ఉత్తమశ్రేణికి చెందిన యీ గాథలను ఆదరించి మా సంకల్పానికి ఆర్ద్రావళి చేయూత నిస్తుందని విశ్వసిస్తున్నాము.

— బుక్ మన్స్.

*

* *

# విషయానుక్రమణిక



* *

*



# గజపతులనాటి గాథలు

(రెండవ భాగము)

## 1. పట్టుదల

పేరునకు మాత్రం అడిదం సూరకవి విజయనగర సంస్థాన కవే. కాని, ఆ హోదాకు తగిన జీవికమాత్రం ఆయనకు రాజధానిలో లేదు. అందువల్ల తన కన్నివధాలా అనుకూలంగా వున్న రామచంద్రపురంలో కాపురం పెట్టుకొని, చుట్టుప్రక్కల వూళ్ళకు సంచారం వెళ్ళుతూ, మన్యదేశాలు తిరుగుతూ, జమీందారుల మన్ననలను పొందుతూ కాలం గడుపుతూ వుండేవాడు. రామచంద్రపురం విజయనగరానికి దగ్గరగానే వుండడం చేత అప్పుడప్పుడు మహారాజులుంగారి దర్శనానికి వస్తూ వుండేవాడు. సూరకవి యెప్పుడు విజయనగరానికి వచ్చినా, ఆయన కోరిన సమయంలో మహారాజు

లుంగారిని దర్శించుకోవచ్చును. ఆయన రాజధానిలో వున్నన్నాళ్ళూ నిత్యమూ ఆయునబసకు ఆహార వస్తువులూ, భత్య ఖర్చులూ పంపబడాలి. ఇది మహారాజావారు ఎప్పుడో యిచ్చిన తాఖీదు. సూరకవి మీద ఆ ప్రభువునకు అంత ఆదరం!

అయితేనేమి? దివాను సీతారామరాజుగారికి యిదేమీ కిట్టలేదు. ఆస్థానకవి అనిపించుకుంటూ వున్న ఆసామీ రాజధానిలో కాకుండా వేరే ఊరులో కాపురం వుండడమూ, ఋతరత్రా వ్యాపకం చేసుకోవడమూ, తరుచుగా పరదేశిలాగు వస్తూ, భత్య ఖర్చులూ, స్వయంపాకాలూ వసూలు చెయ్యడమూ ఆయనకు సుతరామూ యిష్టంలేదు. అయినా ఏం చెయ్యగలడు? ప్రభువుల ఆజ్ఞను తిరస్కరించే శక్తి ఆతనికి ఎక్కడిదీ?

అంతే కాదు. సీతారామరాజుగారికి సూరకవి మీద ప్రత్యేకంగా అక్కసు వుంది. ఇదివరలో ప్రభువులు గుడులకూ, మసీదులకూ మాన్యాలు యివ్వగా, వాటి నన్నిటినీ లాగుకుని తిరిగీ సంస్థానంలో కలిపేశాడీ దివాను. ఇతని చర్యలను విమర్శిస్తూ సూరకవి చాలా పద్యాలు చెప్పాడు కూడా. ఆ సంగతి దివానుకు కూడా తెలుసును. అయినా – తన పేరుపెట్టి విమర్శించనందున ఎదురుగా అతన్ని ఏమీ అనలేకపోయేవాడు. మనస్సులో మాత్రం అతనిమీద విపరీతపు కోపం వుంది. కాని, ఏమీ

చెయ్యలేక దాన్ని దిగమింగి, తగిన సమయం కనిపెట్టి శాస్తి చెయ్యాలనుకున్నాడు.

బాగా యోచన చెయ్యగా దివానుగారికి ఒక ఉపాయం తట్టింది. అది ఏమిటంటే—యీసారి సూరకవి మహారాజులుంగారిని దర్శించడానికి కోటలోకి వచ్చినపుడు ఆయనకు ప్రభువుల దర్శనం లభించకుండా చెయ్యడం. అది తనకు కొంత సులభం కూడాను. మహారాజులుంగారి భవనంలో "దారూగా"లు కొందరుంటారు. వాళ్ళ అనుమతి లేనిదే యెవ్వరూ లోపలికి వెళ్ళడానికి వీలులేదు. వాళ్ళు ద్వారరక్షకులన్నమాట. మహారాజులుంగారికి చాలా విశ్వాసపాత్రులయినవారే ఆ పదవిలో నియమించబడతారు. వాళ్ళలో పతివాడ పైడన్న అనేవాడు మొనగాడు. దారూగాలందరికీ పెద్ద. ప్రభువుల అభిమానపాత్రుడు. దివాను పైడన్నను పిలిపించి గట్టిగా చెప్పాడు. ఈసారి కవిగారు వచ్చినప్పుడు, ఆయనను లోపలికి విడిస్తే దేవిడీ మన్నా తప్పదని గట్టిగా చెప్పాడు. పైడన్న భయభక్తులతో దివానుగారికి నమస్కారాలు చేస్తూ 'సిత్తం, సిత్తం' అన్నాడు.

మరి మూడు రోజులకే సూరకవిగారు రాజభవన ద్వారం దగ్గర ప్రత్యక్షమయ్యారు. పైడన్న మామూలుగానే చేతులు జోడించి నమస్కరిస్తూ ద్వారానికి మధ్యగా నిలబడ్డాడు.

సూరన—ఏమి పైడన్నా! అడ్డంగా నిలిచావు; లోపలికి వెళ్ళకూడదా యేమిటి?

పైడన్న—సిత్తం, సిత్తం. పెబువులవారు లోపల యారితోనో ఆలోసిస్తూ వుండారండి. యిప్పుడు యెవ్వరినీ లోపలికి వదలవద్దని అన్నారండి.

సూరన—ప్రభువులే అలా అన్నారా?

పైడన్న—అవును - కాదండి - అయితే నేం? పెబువు లన్నట్లే నండి?

సూరన—సరే! అయితే - నువ్వు లోపలికి వెళ్ళి నేను ప్రభువుల దర్శనానికి వచ్చినట్లు మనవిచెయ్యి. సమయం కాదని వారు సెలవిస్తే సాయంత్రం వస్తాను.

పైడన్న—అదిగదీ! అలా రావడమే మంచిదండి? యిప్పుడు నేను యీచోటు విడిచి, లోపలికి వెళ్ళవచ్చునా అండి?

సూరన - ఎందుకు వెళ్ళకూడదూ? నువ్వు ఇదివరకు ఎన్నిమార్లు నేను వచ్చినట్లు ప్రభువులకు మనవి చెయ్యలేదు? ఇప్పు డేమో చాలా వింతగా మాట్లాతున్నావు గాని.

పైడన్న—నిజమేనండి. అయినా పెబువులను తగిన యేల సూడాలని తమకూ తెలుసును గదాండి?

సూరన—(కొంచెం కోపంగా) అవునోయ్, పైడన్నా! అంత అజ్ఞానుడికి చెప్పినట్లు చెప్తున్నావేమిటోయ్? ప్రభువుల సమయాసమయాలు తెలుసుకోకుండా సూరకవి యెప్పు

డైనా రావడం చూశావా? ఇది భోజన సమయమా? నిద్రా సమయమా? ఎవరితోనో మాటలాడుతూ వున్నట్లు నువ్వేగదా యిప్పుడు చెప్పావు? నేను వచ్చినట్లు తెలుపుడు చెయ్యమంటే చెయ్యవాయను! ఇది చాలా విచిత్రంగావుంది.

పైడన్న—సిత్తం, సిత్తం. ఇదివరకంటే అలాగే గానండి, యిప్పుడంతా మారిపోయిందండి.

సూర—ఏమీ మారడం లేదు; నీ బుర్రలో బుద్ధే మారిపోయింది. ఈ దినం ప్రభువుల దర్శనం నాకు కాకూడదంటూ నువ్వు యెంచేతనో పట్టుపట్టినట్లు తెలుస్తూ వుంది. నేను తలిస్తే నిమిషంలో లోపలికి పోయేవాడినే కాని అది నాకు యిష్టం లేదు. యింతకీ ప్రభువులవల్ల ఏదో మహోపకారం పొంది, అంతా పడివేసుకుని పోవాలనీ నేను రాలేదు. వాడుక ప్రకారం వచ్చాను గాని, నన్ను ఆటంకపరిచి, నోర్లుకొనే దేదో నీవే నోర్లుకో; నీలాగే నేనూ పట్టుదల మనిషినే? నువ్వు యీ పదవిలో వుండగా - యిక నేను ప్రభు దర్శనానికి వచ్చేమాట మాత్రం కల్ల అనుకో!

ఇలా అంటూ సూరకవి క్రోధమూర్తియై చరచరా అక్కడినుంచి వెళ్ళిపొయ్యాడు.

రాజభవనానికి సమీపంలోనే దివాంజీవారి కచేరీ చావడి ఉంది. ఆయన తన పని చూసుకొంటూ వుండీకూడా, రాజభవనానికి ఎవ్వరు వెళ్ళినదీ, అక్కడినుంచి యెవ్వరు వచ్చినదీ గమనిస్తూనే వుండడం అలవాటు.

సూరకవి రాజ భవనానికి వెళ్లుతూ వుండడం కొద్ది క్షణాల కిందటే దివాను సీతారామరాజుగారు చూశారు. చూసి, యీ రోజు పైడన్న మూలంగా సూరకవిగారికి అవమానం ఎలాగూ తప్పదంటూ లోలోపల కులుకుతూ వున్నారు. ఇంతలో చాలా త్వరగానే సూరకవి తిరుగుముఖం పట్టడమూ, ముఖం కోపంతో వుండడమూ చూచి దివానుకు అపరిమితానందం కలిగింది. అదే సమయంలో అతన్ని పరామర్శించాలనే కుతూహలమూ కలిగి, నౌకరును పంపి, కవిగారిని లోపలికి రప్పించాడు.

దివాను—నమస్కారాలండీ, సూరకవిగారూ! ఈ రోజే దయచేశా రనుకుంటాను.

సూర—చిత్తమండి; పొద్దునే వచ్చాను.

దివాను—ప్రభువుల దర్శనానికి ఇప్పుడే వెళ్ళినట్లున్నారు. ఇంతలోనే తిరుగుముఖం పట్టారేమీ? ఏమిటి? ప్రభువుల దర్శనం కాలేదా?

సూర—అవునండి కాలేదు. అందుకనే తిరిగి వెళ్ళిపోతున్నాను.

దివాను—అదేమిటి? సూరకవిగారికి ప్రభుదర్శనం లభించకపోవడం యేమిటి? చాలా వింతగా వుంది!

సూర—తమ అనుగ్రహం అండి. పొగరుబోతులైన దారాగాలు రాజ భవనాలలో ఉండడంవల్ల మర్యాదస్తులకు కలిగే ప్రతిఫలం యిదీ. వాడు లేడూ - పతివాడ

పైడన్న! ఎప్పుడూ అడ్డురానివాడు - ఏం వినాశకాలం వచ్చిందో యేమో, 'ప్రభు దర్శనానికిది సమయం కాదు; వెళ్లిపొ'మ్మన్నాడు.

దివాను—కాస్త నిరీక్షించలేకపోయారా?

సూర—ఏం నిరీక్షణండీ, నా మొహం; నేను వచ్చినట్లు ప్రభువులకు తెలియజెయ్యమని కోరితే - దానిక్కూడా వాడు నసేమిరా అంటే ఎంతసేపు నిరీక్షించీ ఏం లాభం వుంటుంది?

దివాను—అదా, సంగతి? ఇంతకీ ఇది అసమయం ఏమో?

సూర—అసమయం ఏమిటి? ఎప్పుడూ యిదే సమయానికి గదా నేను ప్రభువుల దర్శనం చేస్తూ వుండేది. ఈ రోజు ఏమో యిలా జరిగింది. వాడు పట్టుపట్టి యీ దినం నన్ను లోపలికి వెళ్లనియ్యకూడదని నిశ్చయించుకున్నాడని నేను ఊహించాను. నాకూ అంత అగత్యకార్యం మించిపోయిందేమీ లేదు. మరొకప్పుడు దర్శనం చేసుకుంటాను. ఇది మాత్రం నిశ్చయం. ఆ పొగరుబోతు దారూగాగా వుండగా, నేను రాజభవనంలో ప్రవేశించ దలచుకోలేదు.

దివాను—(రిచ్చపోతూ) ఆఁ! ఆ! అదేమిటలా సెలవిస్తున్నారు. సూరకవిగారూ! పిచ్చికమీద బ్రహ్మాస్త్రమా? ఇంతకీ వాడి తప్పేముంది గనక! అసమయాన్ని,

అసమయం అనడంలో అపరాధం లేదుకదా ?

సూర — తమరూ ఇలాగే భావించడం నా దుర దృష్టం: బంట్రోతుగాడికే అంత తిరస్కార భావమూ, పట్టు దలా వుంటే నాకు మాత్రం కాస్త పట్టింపు వుండడంలో తప్పేమి వుంది ? ఇంతకూ తమవంటి ప్రభువుల అనుగ్రహం వున్నవాళ్ళమీద ఏ అస్త్రాలూ, ఎంతమాత్రమూ పని చెయ్యవు.

ఇలా అంటూ సెలవు తీసుకుని సూరకవి చరచరా బసకు వెళ్ళిపోయాడు. దీనివల్ల ఎలాంటి పరిణామం ఏర్పడు తుందో అని దివానుగారికీ కొంత దిగులు ఏర్పడింది.

సూరకవి బస చేరుకుని స్నాన, సంధ్యావందనాదులూ, ఆహ్నికమూ నెరవేర్చుకుని, భోజనం చేసి, అప్పుడే సావిట్లో తుంగచాపమీద కూర్చుని తాంబూల చర్వణం చేస్తూ వున్నాడు. ఇంతలో దారూగా పైడన్న చెమటలు కక్కు కుంటూ, రోజుకుంటూ అతని దర్శనానికి వచ్చాడు.

అప్పటికి ఒంటిగంట అయి వుంటుంది.

ఎండ మహా తీవ్రంగా ఉంది.

ఆ తీవ్రతతోపాటు సూరకవి చురచురచూపులు పైడన్నమీద ప్రసరించి, అతన్ని ఛురీ మాడ్చివేస్తూ ఉన్నవి.

సూర — ఏమిటి పైడన్నా! నురుగులు కక్కుకుంటూ యింత ఎండలో వచ్చావు ? ప్రభువువారు దర్శనం చేసుకోవ

డానికి రావచ్చు నన్నారేమిటి ?

పైడన్న—(వణుకుతూ, చేతులు జోడించి) అది కాదండి, మారాజా! ఛమించాల!

అని మరి మాట చెప్పలేక అలాగే నిలబడి పోయాడు:

అసలు జరిగిన సంగతేమిటంటే—

సూరకవి రాజభవనంనుంచి వచ్చిన కొద్ది సేపటికే మహారాజులుంగారికి జరిగిన సంగతంతా తెలిసిపోయింది. చారులు పైడన్నకీ, కవిగారికీ జరిగిన వాగ్వాదమూ, దివాంజీ వారికీ, కవిగారికీ జరిగిన సంభాషణా పూర్తిగా మహారాజులుంగారికి మనవి చేశారు. ప్రభువు లిది అంతా తెలుసుకుని, ఆశ్చర్యపడి చాలా నొచ్చుకున్నారు. ఆయన ఉత్తర క్షణం లోనే పైడన్నను పిలిపించి, నానా చీవాట్లూ పెట్టి, 'దేవిడీ మన్నా' చెప్పారు—అంటే ఆ వెంటనే పనినుంచి తొలగించి వేశారు. అందువల్ల పైడన్న కవిగారి దగ్గరికి పరుగెత్తు కొచ్చాడు. సూరకవి క్షమించి—'ఈ తప్పు ప్రభువులు క్షమించాలి?' అంటూ ప్రభువులను కోరితే పైడన్నకు పోయిన వుద్యోగం మళ్లీ లభించవచ్చును. అందుకోసం ఆయన కాళ్ళమీద పడి బతిమాలుకోవడంకోసం వచ్చాడు పైడన్న, నెత్తి మాడుతూవున్న ఎండలో.

పైడన్న వాలకం బట్టే సూరకవి సంగతి అంతా గ్రహించాడు. అయినా 'సంగతి ఏమి' టంటూ అతన్ని ప్రశ్నించాడు.

పైడన్న సమాచారం అంతా వివరించి చెప్పాడు. అలా చెప్పి, తాను బుద్ధిపూర్వకంగా ఏమీ చెయ్యలేదనీ, క్షమించాలనీ, క్షమించి ప్రభువులతో మనవి చేస్తేనేగాని తనకి మళ్ళీ పోయిన నౌఖరీ దొరకదనీ, చాలా చాలా ప్రాధేయపడ్డాడు.

సూర—అవునోయ్ పైడన్నా! అంతా తెలిసీ వుండి చేజేతులా కొరవితో తల గోక్కున్నవాడిని గురించి నేను ఏం చెప్పను? చేతులు కాలినతర్వాత ఆకులు పట్టుకుంటే లాభం ఏమిటుంది గనక! ఇంతకీ ఎవరి కర్మ వాళ్లు అనుభ వించాలి కదా!

పైడన్న—అలా తమకు సెలవిస్తే యెలాగ? బీద వాళ్లం చచ్చిపోమూ - మూరుకుణ్ణి. చమించాల?

సూర—నీ వాలకం బాగా వుంది. అందుతే జుట్టూ అందకపోతే కాళ్ళూ! దారూగా పదవి అంటే మహా రాజులుంగారి తర్వాత మహారాజులుంగారి పదవిలాంటిదని విర్రవీగావు. ఈ బాపనయ్య నన్నేం చేస్తాడని అనుకున్నావు. నిజానికి - నేనేమి చెయ్యకపోయినా - ఆ ప్రభువులే ఆలో చించి నీకు తగిన శాస్తి చేశారు. ఇప్పుడు నన్ను ప్రభువుల వద్దకు పరుగెత్తి వెళ్ళి, 'మీరు చేసినది తప్పు సుమండీ!' అని మందలించమంటావు గదూ! ఇలా కోరడానికి యే మొగం పెట్టుకుని వచ్చావు? నిన్ను యీ విధంగా చెయ్యా లంటూ శాసించిన ఆ దివాంజీవారి కాళ్ళే పట్టుకో! ఆయనే

ఏదో మార్గం ఆలోచిస్తారు.

పైడన్న—ఆయన ఆలోచించిన దాన్నిబట్టే కదండీ నాకీ గతి వొచ్చింది. ఆయన సెప్పినట్టు యినకపోతే 'దేవిడీమన్నా' అన్నారు - ఆయన సెప్పినట్లు యిన్నాక 'దేవిడీమన్నా' అయింది. ఎలాగూ నాకు అది తప్పింది కాదు. తప్పించే పెబువులు మీరు తప్ప మరెవ్వరూ లేరు.

సూర—ఈ విషయంలో మరి ప్రాధేయపడి ప్రయోజనం లేదు. నేను ఎంతమాత్రమూ ప్రభువులకు ఏమీ మనవి చెయ్యలేను. సూరకవి సంగతి నీకూ బాగా తెలుసు. ఈ మాత్రంతో నేను ఊరుకోవడమే గొప్ప మేలు చేసినట్లు అనుకో.

ఇలా అంటూ ఆయన పైడన్నవైపు రూక్షంగా చూసేసరికి, అతడు గడ గడ లాడపోయి 'బుద్ధి బుద్ధి' అంటూ చల్ల చల్లగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఈ సంగతి తెలిసి దివాంజీసాహెబుగారు ముక్కుమీద వేలు వేసుకున్నారు.

———

# 2. పురస్కృతి

ఆనంద గజపతి మహారాజులుంగారి ఆస్థానంలో పాండిత్యానికి తప్ప కవిత్వానికి గౌరవం లేదనీ, కవులకు ఆస్థానంలో ప్రవేశం లభించడమే దుర్ఘటమనీ, ఒకవేళ ప్రవేశం కలిగినా సమ్మానం లభించడమనేది అసాధ్యమనీ లోకం అంతటా తెలిసిపోయింది. ఇది కవులకు కొంత మనస్సంకటం అనిపించింది. అయినా ఏమీ మార్గం తోచక వారు ఊరుకోవలసి వచ్చింది.

కవిత్వం విషయంలో మహారాజులుంగారికి యిలాంటి అభిప్రాయం కలగడానికి కారణం లేకపోలేదు. మహారాజులుంగారి ఆస్థానంలో వున్న విద్వాంసు లందరికీ అంతో యింతో, కవనశక్తి వుంది. ఒకప్పుడు ఒక కవి ప్రభువుల దర్శనం కోరి రాగా – దర్శనం లభించడంలేదు. అతడు దానికి కారణం సంస్థానంలోని విద్వాంసులే అంటూ ఊహించి పండితులకు కావ్యం వ్రాసే యోగ్యత లేనందున కవులంటే కిట్టక యిలా చేశారంటూ విమర్శించాడట. ఈ సంగతి ఆస్థాన విద్వాంసు లందరికీ తెలిసింది. వారు రెండు రోజుల్లో కృషిచేసి, అద్భుతంగా కవిత్వం చెప్పగలిగినారట. ఈ సంగతి ఆ కవికి తెలియగా ఆశ్చర్యపోయాడట.

ఒక్క ఆస్థానకవులకే కాదు. సంస్థానంలో మహారాజులుంగారికే కాకుండా ఆయన మిత్రుల కందరికీ కూడా కవిత్వం వచ్చును. కవిత్వాన్ని సులభంగా అలవరచుకో

వచ్చుననీ, పాండిత్యం సంపాదించడ మనేదే కష్టతరమనీ, కవి కావడ మనేది సామాన్య విషయమే అనీ, మహా రాజులుంగారి మనస్సులో ఒక అభిప్రాయం ఏర్పడిపోయింది. వారి అనుయాయులూ, మిత్రులూ కూడా ఆయన మతాన్నే అనుసరించారు. ఇక అస్థాన విద్వాంసుల సంగతి చెప్ప నక్కరే లేదు.

ఈ కారణంవల్ల సుప్రసిద్ధులయిన శ్రీమాన్ మాడ భూషి వేంకటాచార్యులుగారు మొదలైన విద్వత్కవులకు కూడా ఆనంద గజపతి ప్రభువు ప్రాపకం లభించకపోయింది. తక్కిన కొందరు కవులు నిరుత్సాహంతో వెనక్కి మళ్ళవలసి వచ్చేది.

దీన్ని బట్టి మహారాజులుంగారు సరసులు కారనీ, కవిత్వం అంటే ఆయనకు యిష్టం లేదనీ అనుకోడానికి వీలు లేదు. ఏమంటే - ఆయన స్వయంగా విద్వాంసుడే కాక కవి కూడాను. సాహిత్యంతో పాటు సంగీతాన్ని కూడా సమానంగా గౌరవించి, అనేకులయిన సంగీత విద్వాంసులను పోషించిన సంగీత రసజ్ఞ చక్రవర్తి. ఏ విషయంలోనయినా సరే పాండిత్యం అంటే పరమ గౌరవం. కవిత్వం అన్నివిధాలా పాండిత్యానికి తీసికట్టనీ, దానికి సమ్మానం జరిపించడం ప్రశస్తం కాదనీ ఆయన ఆశయం.

తమ గౌరవ ప్రతిష్ఠలకు భంగం కలక్కుండా వుండ డానికి అస్థాన విద్వాంసు లందరూ కవిత్వంలో మంచి కృషి

చెయ్యసాగినారు. పాండిత్యం వుంటేనేగాని ప్రవేశం లభించ దని తెలుసుకొని కవులు పాండిత్యం సంపాదించుకోవడానికి గట్టి ప్రయత్నాలు చెయ్యసాగినారు.

మొత్తంమీద కేవలం కవితా ప్రదర్శనం చేసి సమ్మానం పొందినవా రెవ్వరూ లేరు. పాండిత్యం ప్రదర్శించి సమ్మానం పొందనివారూ లేరు.

ఈ విషయంలో మహారాజులుంగారికి ఒక విధమైన పట్టుదల అని కూడా చెప్పవచ్చు. ఎలాగన్నా, ఏ కవికైనా సమ్మానం జరిపించి ప్రభువులను ఓడించాలని ఆయన మిత్రులు యెన్నివిధాల ప్రయత్నించినా లాభం లేకపోయింది.

అభినవాంధ్ర భోజులైన ఆనంద గజపతి మహా రాజులుంగారి ఆస్థానానికి వచ్చి, చాలామంది విద్వాంసులు పురస్కృతి పొందుతూ వుండేవారు. కొందరు వారి ఆస్థానానికి రాకపోయినా, వారి విద్యాకృషినీ, గ్రంథరచననూ, గ్రంథ ప్రకటనమునూ ప్రోత్సహించి మహారాజావారే తగిన సత్కారం పంపుతూ సర్వవిధాలా సాయపడుతూ వుండడ మున్నా కద్దు. అందువల్ల వివిధ ప్రాంతాలనుంచి సంగీతం లోనూ, శాస్త్రాల్లోనూ అపార పరిశ్రమ చేసిన విద్వాం సులు మహారాజులుంగారి దర్శనం చేసుకొనడానికి కుతూహల పడుతూ వుండేవారు.

సామాన్యంగా కవులకూ, పండితులకూ ఇతరుల పచ్చ ఓర్చడమనే ఉదారగుణం తక్కువ. వీలయినంతవరకూ

యితరులను చులకన చేస్తేనే తమకు గౌరవం అనే అభిప్రాయం వుండడం సహజం. కాని, విజయనగర సంస్థాన విద్వాంసుల విషయంలో మాత్రం దీనికి విపరీత లక్షణం కనబడుతుంది. ప్రభువులకూ, పండితులకూ సన్నిహిత సంబంధం వుండడంవల్ల ప్రభువుల విశాలహృదయం విద్వాంసులలోనూ వ్యక్తమయ్యేది. ఆస్థాన విద్వాంసులకు ఎలాటి లోపమూ లేకుండా ప్రభువులు గమనిస్తూ వుండడంవల్లా, ఇతర విద్వాంసులను నిరసించడంచేత తమకు ప్రయోజనం లేనందువల్లా కూడా అక్కడి విద్వాంసులు ఆగంతుక విద్వాంసులను మర్యాదతోనే చూచేవారు. వారిలోని పాండితీవిశేషాన్ని గౌరవించేవారుకూడాను. శాస్త్రపండితులూ, సంగీత విద్వాంసులూ కూడా ఇలాటి ఔదార్యం చూపేవారు.

బిడారం రాచప్ప మైసూరు మహారాజులుంగారి ఆస్థానంలో సంగీత విద్వాంసుడు. ఆ కాలంలో పేరుపడ్డ కొంత మంది విద్వాంసుల్లోనూ అత డొకడు. తన విద్వత్తును నాలుగుచోట్ల ప్రదర్శించి, నలుగురి మెప్పు పొందాలనే కుతూహలం అతని కెక్కువ. అందువల్లనే అతడు దేశంలోని ముఖ్యపట్టణాలను చూస్తూ సంచారం చేయసాగినాడు. ధనార్జన అతనికి ముఖ్యమైనది కాకపోయినా, అనుకున్నదానికంటె ఎక్కువగానే ధనం లభిస్తూ వచ్చింది.

రాచప్ప ప్రధానాశయం విజయనగరం ఆనంద గజపతి ప్రభువును మెప్పించి, ఆయనవల్ల గౌరవాన్ని పొందవలెననీ,

లేకపోతే తన జన్మ చరితార్థం కాదనీ, తన పాండిత్యా నికి ప్రతిష్ఠ కలగదనీన్నీ, ఆనంద గజపతి ప్రభువుల ఆస్థానంలో తన్ను మించిన సంగీత విద్వాంసులు - వీణ వెంకటరమణదాసు, కలిగొట్ల కామరాజు మొదలైనవా రున్నారనీ, వారిని కాదని, అంతకంటె తన పాండితని ప్రద ర్శించి, ప్రభువుల మన్నన పొందడం సాధ్యం కాదనీన్నీ అత నికి తెలుసును. అయినా - ఆస్థాన విద్వాంసు లీ విషయంలో తనకు ఎక్కువ సాయపడగలరనే ధైర్యమున్నూ వుంది. ఏయే పద్ధతులలో తన పాండిత్యాన్ని ప్రదర్శిస్తే ప్రభుని మనస్సు ద్రవిస్తుందో, తెలుసుకుని ఆ విధంగానే చెయ్యాలని నిశ్చయించుకున్నాడు రాచప్ప.

రాచప్ప విజయనగరం వచ్చి, మొదట ఆస్థాన సంగీత విద్వాంసులను కలుసుకున్నాడు. వారు ఎంతో గౌరవించి, ప్రోత్సాహకరంగా మాట్లాడారు. ఏయే రాగాలు ప్రభువుల కిష్టమో, వాటిని ఏయే పద్ధతులలో ఆలాపించి, ఏయే కృతులు గానం చెయ్యాలో వివరించారు. శీఘ్రంగా ప్రభువుల దర్శనం అయ్యేటట్లున్నూ, గానసభ ఏర్పాటు చేసేటట్లున్నూ చెయ్యగలమని హామీ యచ్చారు. ఇంతే కాకుండా ప్రభు వుల సభలోని విద్వత్కవులతో సంప్రతించి, కార్యకలాపం యే విధంగా జరుపవలసినదీ రహస్యంగా నిర్ణయించు కున్నారు. ఈ విషయంలో ఆస్థానవిద్వాంసులూ గొప్ప సహా కారం చూపించడానికి నిశ్చయించుకున్నారు. కాని యెవ్వరూ

బయటపడకుండా, కార్యకలాపం అంతా దానంతట అది జరిగేటట్టు తగిన పథకం ఏర్పరచారు.

మైసూరు సంస్థానంనుంచి మహా విద్వాంసు డొకడు వచ్చి, గానప్రదర్శనం చేస్తాడని విజయనగరం అంతటా తెలిసిపోయింది. ఆ మహాసభకు అందరికీ ప్రవేశం కలగడం సాధ్యం కాదు. మహారాజులుంగారే తమ అస్థానంలోని విద్వాంసులకూ, ఉద్యోగస్థులకూ, కొందరు పురప్రముఖులకూ ఆహ్వానాలు పంపవలసిందిగా ఆజ్ఞాపించారు.

నిర్ణీత సమయానికి ఆహూతు లందరూ వచ్చి తమ తమ స్థానాల్లో ఆసీను లయారు.

మహారాజులుంగారు తక్తుమీద ఆసీను లయ్యారు. గద్దెకు ఎదుటగా కొంత దూరంలో రత్నకంబళిపై రాచప్ప ఆసీనుడయి 'గజానన యనుచు సదా–' అనే గణపతి ప్రార్థనతో ప్రారంభించి సభలోని అందరూ తన్మయులయే టట్లు తన గాంధర్వకళను ప్రదర్శింప సాగినాడు. కొంచెం సేపయాక మహారాజులుంగారికి యిష్టమయిన రాగాలు యిదివరకే తెలుసును కాబట్టి – వాటిని ఆలాపించి ఎక్కువ ఆనందాన్ని ప్రభువులకు కలిగించాడు. ప్రభువులు చాలా సంతోషించి, స్వయంగా కొన్ని కృతులను పురమాయింపగా – తణుకూ, బెణుకూ లేకుండా వాటినన్నిటినీ గానం చేశాడు. అదీకాక –ఆస్థాన సంగీత విద్వాంసులు కోరిన క్లిష్ట రాగాలను అనాయాసంగా ఆలాపన చేసి 'సెబాస్' అని

పించుకున్నాడు.

రమారమి మూడు గంటలసేపు యిలా గానప్రదర్శనం జరిగింది. సభ్యులందరూ చిత్ర ప్రతిమల్లా నిశ్చేష్టులయి కదలక, మెదలక వుండి పోయారు.

మహారాజులుంగారికి యిష్టమయిన రాగాలలో ఇష్టమయిన కృతులన్నీ గానంచెయ్యబడ్డాయి. సభ్యుల కోరిక మీద రెండు హిందూస్తానీ రాగాలూ ఆలాపించబడ్డాయి. మహారాజులుంగారికి అత్యంతప్రియమయిన ఆనందభైరవి రాగం ఒక్కటే యింక మిగిలిపోయింది. అప్పుడు రాచప్ప చేతులు జోడించుకొని, ప్రభువుల కెదురుగా నిలిచి 'మహాప్రభూ! ప్రభువులూ, సదస్యులూ నా యెడ చూపిన ఆదరాభిమానాలకు కృతజ్ఞుడను. ప్రభువులకు ఆనందభైరవి రాగం మీద ఎక్కువ అభిమానం వుందని తెలిసింది. ఆనందగజపతి ప్రభువులకు - హాయిని కూర్చే ఆనంద భైరవిమీద అభిమానం ఉండడం సహజమే! ప్రభువుల ఆజ్ఞ తీసుకుని - ఆ రాగంలో - ప్రభువులమీద ఒక కవి కట్టిన జావళీని పాడి నా ప్రదర్శనాన్ని ముగించాలని వుంది' అన్నాడు.

తనమీద అలాంటి జావళీ వున్నట్లు ప్రభువుకు తెలియనే తెలియదు! ఆయన, నిర్ఘాంతపోయి, ఒక్క క్షణం మాత్రం ఆలోచించి 'సరే' అంటూ అనుమతి యిచ్చారు.

మైసూరు విద్వాంసుడు ఆ వెంటనే మహోత్సాహంతో రాగాలాపన చేసి

'ఎందు కీ తొందర ?
సుందరాకార ! నీ
పొందుగూడెద తాళరా!'

అని జావళీని అందుకోవడంతో సభ అంతా నిస్తబ్ధమైపోయింది. సుదీర్ఘమైన ఆ జావళీ పూర్తి అయేసరికి అర గంటకు పైగా పట్టింది. చివరకు—

అభినవ
'భోజ భోగ బిడౌజ మానస
తేజ మలర నిన్ను గూడెద
రాజశ్రీ ఆనందగజపతి
రాజ మాహారాజ తేజా!'

అని ముగించే సరికి సభ్యుల కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. ఆనంద పారవశ్యంచేత ఆయన కన్నులనుండి రెండు ఆనందబాష్పాలు రాలాయి.

ఆయన దివానువైపు దృష్టి ప్రసరించాడు. వెంటనే దివాను లేచి యిలా చెప్పాడు—

"మహారాజులుంగారు మైసూరు విద్వాంసులు రాచప్ప గారి గానప్రదర్శనాన్ని చాలా మెచ్చుకుంటున్నారు. చివర పాడిన యీ జావళీ శ్రీ వారిని మరీ చకితులను చేసింది. ఈ సంగీత విద్వాంసుల ప్రదర్శనానికి పారితోషికంగా వెయ్యి న్నూట పదార్లు ప్రభువులు యివ్వాలని హుకుం చేశారు."

దివాను యిలా చెప్పేసరికి అందరూ కరతాళ ధ్వనులు

చేశారు.

దివా నింకా నిలిచే వున్నాడు—

"మరొక శుభవార్త. ప్రభువులు కవులను గౌరవించడం అరుదని చాలామంది అభిప్రాయం! ఆ అభిప్రాయం సత్యం కాదని నేడైనా అందరూ తెలుసుకోవాలి! ఈ విద్వాంసునితో సరిసమానంగా - యీ జావళీని కూర్చిన కవిరాజును కూడా వెయ్యిన్నూట పదహార్లతో గౌరవించాలని ప్రభువుల కోరిక. ఇంత మధురంగా కవిత్వం చెప్పగలవా రున్నారా? అని ప్రభువులకే ఆశ్చర్యం కలిగింది. ఆ అజ్ఞాతకవు లెవరో — యీ సభలో వుంటే ముందుకు రావచ్చు."

దివాను యిలా చెప్పడంతోటే జనసమూహాన్ని తప్పించుకొంటూ ఒక వ్యక్తి ప్రభువుల గద్దెకు నమస్కరించి, చేతులు జోడించి నిలుచున్నాడు.

అతన్ని చూచి అందరూ ఆశ్చర్యపోయారు. ప్రభువులు కూడా నమ్మలేక "ఏమిటీ! నువ్వేనా ఈ జావళీ వ్రాసింది?" అన్నారు.

అతను ప్రభువుల కచేరీలో పనిచేస్తూ వున్న చిన్న ఉద్యోగి!

అతడు వణుకుతూ "చిత్తం మహాప్రభూ! ఏమయినా అందులో తప్పుంటే క్షమించాలి" అని అన్నాడు.

"ఇలా వ్రాయడం నీకు ఎలా సాధ్యమయింది?" అని

ప్రభువు లడుగుతున్నారని దివాను వివరించాడు.

అతడు ధైర్యంతో "అంతా సాధ్యమే! అసాధ్యం యేమీ లేదు. అప్పుడు భోజమహారాజులుంగారి ముఖం ఒక్కమారు చూచేసరికి ఒక సాలెవానికి సంస్కృతంలో కవితాధార కలగగా - దినానికి ఒకసారయినా - ప్రభువులైన అభినవభోజుల దర్శనం చేసుకుంటూ వున్న నాకు ఆంధ్రంలో ఈ మాత్రం కవిత్వం అబ్బడం అసాధ్యం కాదని మనవి చేసుకుంటున్నాను—"

అని అంటూ మళ్ళీ నమస్కరించి, వెనుకకు ఒదిగి నిలుచున్నాడు.

అపూర్వమైన యిలాంటి పురస్కారమూ, సన్నివేశమూ అందరికీ ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ కలిగించాయి.

---

## 3. నిత్యసువాసినులు

అవి పార్సీ నాటక కంపెనీలు తెలుగుదేశంలో కొత్తగా నాటకాల ప్రచారం చేసిన రోజులు! అంతకుముందు తెలుగునాట వీధి నాటకాలూ, భాగవతములూ, బొమ్మలాటలూ మాత్రం ప్రచారంలో వుండినవి. పార్సీ నాటక సమాజాలవారి వేష భాషలూ, ఆట పాటల బాణీలూ, తెరలూ జనాన్ని బాగా ఆకర్షించాయి. మహారాజులూ, జమీందార్లూ, భూస్వాములూ తమ తమ తాహత్తులకొద్దీ నాటకసమాజాలను స్థాపించి, పార్సీపద్ధతుల్లో నాటకాలు ఆడించడానికి పూనుకునేవారు. అలాంటి వారిలో అభినవాంధ్రభోజులు విజయనగర ప్రభువులు ఆనందగజపతి మహారాజులుంగారొక్కరు.

ఆనందగజపతి ప్రభువుకి ఆంధ్రంకంటె సంస్కృతం మీదనూ, కవిత్వంకంటె పాండిత్యంమీదనూ గౌరవాభిమానాలు ఎక్కువ. అంచేత ఆయన సంస్కృతనాటక సమాజాన్ని ఒకదాన్ని స్థాపించి, సుప్రసిద్ధనాటకాలు తమ మోతీ మహల్లో ఆడించి ఆనందించేవారు.

ఇక నాలుగైదు రోజుల్లో శాకుంతలనాటకం ప్రదర్శించాలి. అందులో వేషాలు వేసేవారందరూ – స్త్రీలూ, పురుషులూ తమ కిచ్చిన పాత్రల సంభాషణలను కంఠస్థం చేసి రిహార్సెల్సు జరుపుకుంటున్నారు. విదూషకపాత్రధారి కర్రా

వెంకటశాస్త్రి దుష్యంతవేషధారితో ప్రసంగిస్తూ 'కిం మోదకఖండనే? తర్హిగృహీతో౽యం క్షణః' అని అన్నాడు. యువస్త్రీల పాత్రలు ధరించే వేశ్యల్లో ఒకతె 'నాటకంలోనే కాదు; ఎప్పుడూ శాస్త్రులుగారికి తిండిమీదే మనసు' అన్నది. మరొకామె 'ఆయనకు యితరులిస్తే తీసుకోవడమే గాని, తాను యిచ్చేపద్ధతి లేదు' అంది నవ్వుతూ.

శాస్త్రిగారికి పౌరుషం కలిగింది. నలుగుర్లోనూ భోగంస్త్రీలు తన్ను హాస్యంగానైనా అసడ్డ చేయడం కష్టమనిపించింది. 'యివ్వాకేమీ? మేం షట్కర్మనిరతులం. అన్ని అధికారాలూ వున్నాయి. పుచ్చుకోనూ పుచ్చుకుంటాం; ఇవ్వనూ యిస్తాం' అన్నాడు ఆయన.

ఒకర్తె 'అయితే, శాస్త్రుల్లుగారూ! మిమ్మల్ని ఎక్కువ ఏమీ అడగం! ఒక పూటన్నా మమ్మల్ని మీ యింటికి తీసుకెళ్లి భోజనం పెట్టిన పాపాన పోయినారా? చెప్పండి' అని అడిగేసింది.

మరొకామె 'పాపం! ఆయన బ్రహ్మచారి! ఆయనే వదినెగారు పెడితే తింటాడు; లేకపోతే పస్తుంటాడు. ఆయన మనల్ని పిలిచి ఆతిథ్యం యిచ్చే దేమిటి?' అన్నది.

శాస్త్రులుగారు — 'అదంతా ఉత్తది. మా వదినెగారు అన్నపూర్ణవంటిది. నాకే లోపం చెయ్యదు. మీరెందరు వచ్చినా, ఆతిథ్యం యిస్తానో, లేదో చూడండి. ఏదో ఒక రోజు నిర్ణయించుకుని చెప్పండి' అన్నారు.

ఆ వనిత లిద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. ఇంతలో ఆ దగ్గరలో వున్న పాత్రధారిణు లంతా అక్కడికి చేరి సంగతి తెలుసుకుని 'నేను వస్తాను; నేను వస్తాను' అని అంటూ శాస్త్రి ముఖం వైపు చూశారు. 'ఓ! మీా రంతా నిరభ్యంతరంగా రావచ్చును.' అని శాస్త్రి ధీమాగా సమాధానం యిచ్చాడు.

ఆతిథ్యానికి వచ్చే యువతుల సంఖ్య యించుమించుగా ఇరవైకి తేలింది.

'శుభస్య శీఘ్రమ న్నారు. అయితే ఆలస్యం ఎందుకు? మొన్న నే గదా జీతాలు అందాయి; శాస్త్రుల్లుగారికి చేతిలో డబ్బు ఆడుతూ వుంటుం దిప్పుడే. రేపో ఎల్లుండో నిర్ణయిస్తే బాగుంటుంది' అన్నది మొదటి వేశ్య.

'తొందర రెందుకే? ఇస్తానన్న వారు ఇవ్వకుండా పోతారా? అన్నీ బతపర్చుకోవద్దూ! శాస్త్రుల్లుగారి సంగతి మనకు తెలియదూ! ఆయన జీతం యిదివరకే చాలామట్టుకు కిల్లీలకొట్టుకీ, దేవీమిఠాయి కొట్టుకీ, అరటిపళ్లవాళ్ళకీ పాత బాకీలకింద చెల్లుబడి అయి వుంటుంది. కొంచెం గడువిస్తే మంచిది' అని రెండో వేశ్య అన్నది.

శాస్త్రుల్లు కొంచెం ఆలోచనలో పడ్డాడు. కాని, వెంటనే అతనికి స్ఫురణకు వచ్చింది - అటుక్రింద రోజే అన్న జోగావధానులు నెలకి సరిపడా వస్తువులూ, బియ్యమూ ఇంట్లో పడవేసి గ్రామాంతరం వెళ్లిన సంగతి! ఇక ఫర్వా లేదను

కున్నాడు ; వదినెగారు అమాయకురాలు! ఏదో కల్పించి కథ నడిపించవచ్చు : తన దగ్గరున్న మూడు, నాలుగు రూపా యిలూ కూరకూ, నారకూ సరిపోతాయి. ఇలా ఆలోచించి నిశ్చయించుకుని యిలా అన్నాడు.

'అసంగతులన్నీ మీకు వద్దు. ఆతిథ్యం యివ్వడం నా పూచీ; తీసుకోవడం మీ యిష్టం. ఎల్లుండే కానియ్యండి; ఇలాంటివాటిని జరుపులు పెట్టడం న్యాయం కాదు' అని.

శాస్త్రి యింటికి వచ్చి మెల్లిగా వదినెగారివద్ద చేరి 'వదినా! ఈ రోజు మంచి శుభవార్త ఒకటి చెపుతున్నాను' అని చెప్పగా ఆమె 'ఏమిటి నాయనా! నీకు సంబంధం ఏదన్నా కలిసి వచ్చిందా యేమిటి?' అని అమాయికంగా అడిగింది.

శాస్త్రి: కాదమ్మా! పెళ్లీ, పెడాకులూ ఎవడి క్కావాలి? నేను తెచ్చినది నా పొట్టకే చాలదు. నేను చెప్పే దేమిటంటే – ఎల్లుండి పగలు భోజనానికి మనింటికి గొప్ప గొప్ప యిళ్ల ఆడవాళ్లంతా వస్తారు.

వదినె: ఇది శుభవార్తా బాబూ! వాళ్లంతా వచ్చి, తిని పోతే, మర్నాటినుంచి మనం వస్తు వదుకోవలసి వుంటుంది కదా!

శాస్త్రి: నేను చెప్పేది బాగా బోధపరుచుకోవమ్మా! వచ్చేవాళ్లు ఎవరెవ రనుకున్నావు? కలక్టరుగారి భార్యా, దివానుగారి భార్యా, తాసీల్దారుగారి భార్యా, మేజిస్ట్రేటుగారి

భార్యా, శిరస్తాదారుగారి భార్యా యిలాంటివాళ్లు వస్తారమ్మా! నీకు తెలియదూ? నాకు పెద్ద పెద్దవాళ్లందరితోటీ బాగా పరిచయం, చనువూ వున్నాయని, నామీద అభిమానం కొద్దీ వాళ్లంతా కోరి వస్తున్నారమ్మా!

వదినె: నిజమే? వాళ్లంతా వస్తారా?

శాస్త్రి: అవును వాళ్లంతా యిరవైమంది వస్తారు. మనం ఒకపూట ఆతిథ్యం ఇస్తామో, లేదో గాని, దానివల్ల మనకు ముందు ముందు ఎలాంటి ప్రయోజనం వుంటుందో ఆలోచించు. మన అగ్రహారంలో మంచి భూమి యీనాంగా పట్టా పొందడానికి నేను చాలారోజుల్నుంచీ ప్రయత్నిస్తున్నాను. దాని కిది చాలా ఉపయోగపడుతుంది. ఇంకా ధనరూపంగానూ, వస్తురూపంగానూ మనకు చాలా లాభం వస్తుంది. అన్నయ్యకి వీరందరి ఆశ్రయమూ దొరికిందంటే మనం బంగారంతో గోడలు పెట్టవచ్చన్నమాట! నేను ఆలోచించకుండా సిద్ధపడడం లేదు.

వదినె: బాగుంది లే. అయితే ఆడవారు మాత్రం వస్తారంటావా?

శాస్త్రి: అవును. మగవాళ్లు కచేరీలకు వెళ్తారు. రాత్రిపూటయితే అందరూ రావలసి వుంటుంది. వారందర్నీ భరించడం మనతరం కాదు. ఆడవాళ్ళయితే ఎలాగో ఒక లాగు సర్దుకుపోతారు గాని. ఏమాత్రం లోపం వచ్చినా మగవాళ్లు మొఖంముందే ఆక్షేపిస్తాడు. ఇదంతా ఆలోచించే

పగటిపూట ఏర్పాటు చేశాను. మాటవరసకి మగవాళ్ళనీ పిలిచాను గాని 'మేము రాము; ఆడవాళ్ళనే తీసుకువెళ్ళండి' అని వారంతా అనుమతి యిచ్చారు.

వదినె: (సంతోషంతో) అలాంటి గొప్పవాళ్లు మనింటికి రావడం ఎంతో అదృష్టం అన్నమాట !

శాస్త్రి: సందేహ మేమిటి వదినా? మనకి మంచి రోజులు వచ్చాయనుకో! చూడూ! వాళ్ళంతా శౌక్యులు. ఆలస్యమైతే వుండలేరు. పదకొండుకల్లా భోజనా లయిపోవాలి. నువ్వు తెల్లారగట్లే లేవాలి వంటకి. రేపు సాయంకాలానికే కావలసిన కూరా నారా, అరిటాకులూ అన్నీ చేరవేస్తాను. ఏమిటేమిటి కావాలో చెప్పు.

వదినె: కూరలూ, పెరుగూ యిలాంటివి తెస్తే చాలు. తక్కినవన్నీ యింట్లో సిద్ధంగా వున్నాయి. మొన్ననే కదూ మీ అన్నగారు అన్నీ తెచ్చి పడవేశారు! అయితే తెలియక డుగుతాను, నాయనా! ఆ వచ్చేవాళ్లంతా బ్రాహ్మలేనా?

శాస్త్రి: కాకపోతే నేను మనింటికి పిలుస్తానటమ్మా? నీ అనుమానం గాని!

*   *   *   *

రమారమీ పదకొండు గంటలు కావచ్చింది. విజయనగరం అయ్యకోనేటిగట్టున వున్న జోగావధాన్లుగారి యింటికి బగ్గీల్లోనూ, జట్కాల్లోనూ, ఒంటెద్దు బళ్లల్లోనూ యిరవై మంది యువతులు రకరకాలయిన రంగుచీరలు ధరించి, సీతా

కోకచిలక ల్లాగ తయారయి వచ్చారు. చుట్టుపక్కల యిళ్ళ అమ్మలక్క లంతా ఆశ్చర్యంగా నోరు తెరుచుకుని, గడపల్లో నిలబడి చూడసాగారు.

అంతకు ముందురోజునే అవధాన్లుగారి భార్య యిరుగు పొరుగుల వాళ్లతో చెప్పివేసింది - మర్నాడు తమ యింటికి గొప్పగొప్పవాళ్ల ఆడువారు భోజనానికి వస్తారని. విన్న వాళ్లలో కొందరు 'ఎంత అదృష్టమమ్మా!' అని సంతో షించారు. కొందరు అసూయపడ్డారు కూడా, ముందుముందు వీళ్ల కేం లాభంకలిగిపోతుందో అని. ఇదంతా ఉత్త అబద్ధ మని అనుకున్నారు కొందరు అమ్మ లక్కలు.

కాని, ఆమె చెప్పినట్లుగనే జరిగింది.

వాళ్లు బగ్గీల్లోనూ, వాటిలోనూ రావడమూ, వాళ్ల ముస్తాబుతీరూ, అందచందాలూ వాళ్లు తప్పకుండా గొప్ప గొప్ప ఉద్యోగస్థుల భార్యలే అని అందరూ అనుకున్నారు.

వీ రందరూ వచ్చేసరికే అన్నీ సిద్ధంగా ఉంచబడ్డాయి. శాస్త్రి వచ్చిన అతిథుల నందరినీ చిరునవ్వుతో పలకరించి, సంతోషాన్ని వెలిబుచ్చాడు. వచ్చినవా ళ్లందరూ కాళ్లూ, చేతులూ కడుక్కొని భోజనానికి కూర్చున్నారు.

తొలి వడ్డన వదినె, మరదు లిద్దరూ కలిసే చేశారు. కాని, తర్వాత మాటల సందర్భంలో రహస్యం బయలుపడు తుందో, ఏమో అనే భయంచేత శాస్త్రి వదినెగారిని వంటిం ట్లోనే కూర్చోమని చెప్పి, తానే వడ్డించడానికి పూను

కున్నాడు. అవసరమైన పదార్థాలు తనకు అందిస్తూ వుంటే చాలునని అన్నాడు. తాను వడ్డిస్తే ఏం లోపం జరుగుతుందో అనే అనుమానం పీడించడంవల్ల ఆమెకూడా ఆ పద్ధతి బాగుందనే అనుకున్నది. శాస్త్రి చకచకా తిరుగుతూ ఎవరి క్కావలసినవి వాళ్లకి వెంటవెంటనే అందించేవాడు. వాళ్లు ఆప్యాయంగా భుజిస్తూ అన్ని పదార్థాలూ చాలా రుచ్యంగా వున్నాయని ప్రశంసించారు. కొందరు హాస్యసంభాషణలోకి దిగారు. శాస్త్రి నవ్వుతూ 'భోజనాలు కానియ్యండి మొదట. తర్వాత మాట్లాడుకోవచ్చు' అని చమత్కారంగా వారించాడు.

భోజనా లయాయి.

అతిథులందరూ చేతులూ, కాళ్లూ కడుక్కొని తాంబూలచర్వణం చేసి శాస్త్రితో 'ఇంకా మీ భోజనం కాలేదు కాబోలు! ఇప్పటికే ఆలస్య మైంది. మేం వెళ్లి వస్తాం' అంటూ వారివారి వాహనాలు అధిరోహించి వెళ్లిపోయారు.

అతిథు లందర్నీ సాగనంపి, శాస్త్రి యింట్లోకి వచ్చి వదినెను చూసేసరికి, ఆమె నడుముకట్టు బిగించి, ఉచ్ఛిష్టపాత్రలు తియ్యడానికి సిద్ధంగా వుండడం కనబడింది. శాస్త్రి 'వదినా! నువ్వు వీటిని ముట్టుకోవద్దు. నేను వీటిని తీసివేసి శుద్ధిచేసి, స్నానం చేసి వస్తాను' అన్నాడు.

'నువ్వెందుకు తియ్యడం, యింట్లో ఆడదాన్ని నే నుండగా? వాళ్లు మన బ్రాహ్మణులుగదా! అందులోనూ

సువాసినులు ; వాళ్ల ఎంగిళ్లు ఎత్తితే స్నానం అవసరం లేదు. పునిస్త్రీని నన్నే ఆ పని చెయ్యనియ్యి ' అన్నది.

శాస్త్రి తల వంచుకుని ' వద్దమ్మా? నా మాట విను. వాళ్ళంతా సువాసినులే ? కాని నిత్యసువాసినులు ?' అన్నాడు మెల్లిగా.

' నువ్వంటున్నదేమో నాకు బోధపడడం లేదు ?' అన్నది వదినెగారు.

' అంటే మరేమీ లేదు – వాళ్ళు ఎప్పుడూ సువాసినులే? వాళ్ళకు వివాహమంటూ లేదు. అంచేత వైధవ్యమూ లేదు. వాళ్ళంతా భోగము స్త్రీలు ?' అన్నాడు.

ఈ మాట వినేసరికి వదినెగారి నడుము నటుక్కుమంది. ' ఆఁ? ఏమిటీ ? వీళ్ళంతా భోగంవాళ్ళా ? పెద్దపెద్ద వుద్యోగస్థుల భార్యలు కారూ ?' అంది.

' కారమ్మా కారు ? నీ పిచ్చిగాని, వారంతా మనిళ్ళకు భోజనానికెందుకు వస్తారమ్మా? నువ్వు అమాయకంగా నా మాట నమ్మివేశావు గాని ' అన్నాడు శాస్త్రి.

ఆమె ముఖం చిట్లించుకుంది. ' నువ్వు అబద్ధాలు చెప్పి యిలా మోసం చెయ్యడం బాగుందీ ?' అంది.

' నేను చెప్పిన దాంట్లో కొంత నిజం లేక పోలేదు. వీళ్ళందరికీ నేను చెప్పిన పెద్దపెద్ద వుద్యోగస్థుల ప్రాపకం వుంది. మరో సంగతి! నే నలా చెప్పకపోతే నువ్వు వీళ్ళందరికీ భోజనం పెట్టడానికి వొప్పుకుంటావా ? ఆలోచించు '

అన్నాడు శాస్త్రి.

'ఎందు కొప్పుకుంటానూ? పరువూ, మర్యాదా లేని పనికి నేనే కాదు, ఎవళ్ళూ ఒప్పుకోరు' అన్నది.

'నా మాటలు సావధానంగా విని, ఆమీద ఏమన్నా అను పడతాను. వీళ్ళంతా మా నాటక సమాజంలో పనిచేసే వాళ్ళే! మాటా, మాటా వచ్చి ఒకపూట మనింట్లో ఆతిథ్యం యిమ్మని కొందరు పట్టుపట్టారు! కొందరు. 'శాస్త్రులుగారికి అది సాధ్యం కాదు; వాళ్ళ వదినెగారు ఎంత మాత్రం ఒప్పుకోదు' అన్నారు. నేను పౌరుషం కలిగి 'తప్పకుండా ఆతిథ్యం యిస్తాను? మా వదినెగారిలాంటి మనిషి భూ ప్రపంచంలో లేదు? ఆమె తప్పకుండా ఒప్పుకుంటుంది' అని గట్టిగా చెప్పినందున యిలా చెయ్యవలసి వచ్చింది. దీనివల్ల నిన్ను వాళ్లెంతో మెచ్చుకున్నారమ్మా?' అన్నాడు శాస్త్రి.

వదినెగారు ఏమీ అనలేకపోయింది.

'పోనీ! నువ్వు చెప్పు. నే నిలా చెయ్యకపోతే నా ప్రతిజ్ఞ ఎలా జరుగుతుంది? నీకు ఎలా మంచి పేరు వస్తుంది?' అన్నాడు.

'నిజమే? నాయనా? నువ్వు చెప్పినదీ కాదనలేను. ఇంతకీ జరిగిపోయిన దేమో జరిగి పోయింది. మనం చూసి, చూసి ఎంగిలిచేత్తో కాకిని కొట్టలేము. ఇరవైమంది యింత తిని వెళ్ళడమే చాలును; అంతతోనే తృప్తి పడదాం'' అన్న దామె.

అయితే నేమి? 'రేపట్నుంచీ యింట్లో గడవడ మెలాగ?' అనే దిగులు వదినెకు లేకపోలేదు. 'అన్నగారు వస్తే అతనికి కోపం రాకుండా ఏ విధంగా చెయ్యడం?' అనే ఆలోచన శాస్త్రికీ లేకపోలేదు.

---

# 4. స్వయంకృషి

రామన్న విజయనగరం సంస్థానానికి చెందిన భూపాలరాజు రేగ గ్రామానికి రమారమీ రెండువందల యేళ్ళ క్రిందట కరణంగా వుండేవాడు. ఆ వూరే యిప్పుడు పూసపాటి రేగ అనే పేరుతో వ్యవహరించబడుతూ వున్నది.

ఆ కాలపు కరణాలకు యిప్పటివలె జీతాలూ, బత్తేలూ లేవు. మహారాజులుంగారు అనుగ్రహించిన మాన్యాలు అనుభవిస్తూ, వారివారి విహిత ధర్మాలను నెరవేర్చవలసినదే; మాన్యాలు ఎండినా, పండినా సర్కారువారు జోక్యం తీసికోవడం అరుదు.

ఆ వూరు భూములకు పంట కాలువలు గాని, ఏరు గాని ఆధారం లేవు. ఒకే ఒక పెద్ద చెరువు మాత్రం ఉన్నది. ఆ చెరువు నిండుతే పంటలు పండుతాయి. చెరువు ఎండితే పొలాలు ఎండుతాయి. అందులోనూ ఆ చెరువు గర్భాన్నానుకునివున్న రామన్న మొదలయిన కొందరి మాన్యాలకు నీరు దొరకడమనేదే దుర్లభం; అయినా అతడు ఎలాగో ఒకలాగు గౌరవంగా కాలక్షేపం చేస్తూ, తన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చుకుంటున్నాడు.

ఒక సంవత్సరం ఏమయిందంటే - ఎక్కువగా వర్షాలు పడ్డాయి. ఆ యేడు పుష్కలంగా పంట పండుతుందని రామన్న చాలా సంతోషించాడు.

కాని వర్షాలు ఎడతెగకుండా పడడంచేత ఆ చెరువు

నీరు గంట గంటకీ వృద్ధిపొందుతూ, దాని క్రింది పొలాలు దెబ్బ తింటాయేమో అనే భయం అందరికీ కలిగింది. దానికి తగిన ఏర్పాటు ఏదైనా జరగవలసి వుంది.

రామన్నకు ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు.

ఆ వూళ్ళో దంతులూరి అన్నంరాజుగా రనే ఆసామీ ఉన్నాడు. ఆయన విజయనగరం దివాను సీతారామరాజు గారి అప్తుల్లో ఒకడు. అతడు ఆ గ్రామంలో మహారాజులుంగారి జిరాయతీ భూముల బాగోగులను విచారించుతూ, రైతుల చేత తగినట్లు పని పాటులు చేయిస్తూ, దానిమూలంగా జీవిక గడుపుతున్నాడు. అందువల్ల ఆయనకు పలుకుబడి ఎక్కువ. చెరువును చూసే అధికారంకూడా ఆయనదే. అతను ఎలా చెపితే అలా జరగవలసిందే.

చెరువు పరిస్థితి కళ్ళారా చూచినమీదట రామన్న ఆయన దర్శనానికి వెళ్ళాడు.

అన్నం : నమస్కారం కరణంగారూ?

రామ : నమస్కారాలండి అధికారులకు.

అన్నం : ఈ యేడు మంచి వర్షాలు పడుతున్నాయి గదా అండి? పంటలు సమృద్ధిగా పండవచ్చును గదూ? దస్తు శిస్తులకు చిక్కు ఏమీ వుండదన్నమాట?

రామ : ఆ విషయం గురించే ముఖ్యంగా మీతో మాటలాడ్డానికి వచ్చానండి యిప్పుడు. ఇన్నాళ్లూ అనావృష్టి!

ఇప్పుడో అతివృష్టి? పంటలు పాడవడానికి రెండూ ఒక్కటే నండి. ఈ యేడు చూశారూ—

అన్నం: అదేమిటి కరణంగారూ? అలా అంటున్నారు? మీరు పన్నుల విషయంలో రైతులను ప్రోత్సహించాలి గాని యిలా అనడం భావ్యమా?

రాము: ప్రభువులు పరిస్థితులను గమనించలేదను కుంటాను. మన పెద్ద చెరువు కప్పలా నిండి వుంది. దాని గర్భాన్ని ఆనుకునివున్న పొలాలన్నీ నీటితో నిండి పోతున్నాయి. ఆవైపు గట్టులేని సంగతి ప్రభువులకు తెలిసియే ఉన్నది గదా? ఇప్పుడు ప్రభువులు వెంటనే చెరువు తూములన్నీ తెరిచి నీరు కొంత విడిచివేస్తేనే కాని యీ యేడు ఆవైపు పొలాలనుండి పంట కళ్ళతో చూడలేము.

అన్నం: తూము లన్నీ తెరచివేస్తే చెరువు ఉత్తదే. తర్వాత మనమే యిబ్బంది పడతాము. ఒక తూము తెరచే వుంటుంది కదా!

రాము: ఆ మాట నిజమే గానండి, దాని మూలంగా పోయే నీరు చాలా స్వల్పం. చెరువులోకి వచ్చి పడుతూ వున్న కాలువ నీరు అధికం? అందువల్ల చెరువు నీరు ఎక్కువ అవుతుండే కాని, తగ్గదు. పంట ముఖం పట్టిన చేలు నీటిలో మునిగిపోతే యిక బ్రతకడం కష్టం. మాకు చాలా ఆందోళనగా వుంది.

అన్నం: మీ సంగతేమో మీరు చెప్తారు. తూములు

అన్నీ విడిచివేస్తే ఆ నీరు చేలల్లో పడి తక్కినవాళ్ళ పంట ధ్వంసం కాదని ఎలా చెప్పగలం? అవి తియ్యకుండావుంటే చెరువు గర్భంలో వున్న కొద్ది భూములకే దెబ్బ; తీసివేస్తే చాలా పొలాలు ధ్వంసం అవుతాయి. మీరూ ఆలోచించండి?

రామ: తూములు తెరిస్తే నీరు కాల్వల వెంట ప్రవహిస్తుంది: కాని పొలాలమీదికి వెళ్ళదు.

అన్నం: వెళ్ళదంటూ మీరెలా చెప్పగలరండీ? ఇప్పుడు మనం చెయ్యవలసినది ఏ పొలానికి అపాయం లేకుండా చెయ్యాలనీ, వర్షం తగ్గించాలనీ భగవంతుణ్ణి ప్రార్థించడం తప్ప మరొకటి లేదని నాకు తోస్తున్నది. ఇంతకీ మీరు కవులు! కవులు ప్రార్థిస్తే భగవంతుడు వినకుండా వుండలేడు కదండీ?

ఈ చివరిమాట అంటూ అన్నంరాజు చిరునవ్వు నవ్వాడు. అది తన్ను అవమానించినట్లుగా రామకవి భావించి చిన్నబుచ్చుకొని మరి అక్కడ వుండకుండా గిర్రున తిరిగి యింటికి వెళ్ళి పోయాడు.

ఇంటికి వెళ్తూ రామన్న "ఇక కర్తవ్యం ఏమిటి?" అనే ఆలోచనలో పడ్డాడు. ఇలాటి సమయంలో అధికారి దఖలు తీసుకోకపోతే .ఎవరు మాత్రం ఏమి చెయ్యగలరు? తన కష్టాన్ని ప్రభువువారికి తెలుపడం తప్ప మరేమీ గత్యంతరం వుండదనే ఆలోచన అతనికి కలిగింది. వేళాకోళంగానో,

ఎలాగో అన్నంరాజు అననే అన్నాడు. "మీరు కవులు గదా" అని. పద్యాలతోటే ఒక అర్జీ వ్రాసి పంపితే కొంత ప్రయోజనం వుండవచ్చని అతనికి తట్టినది.

ఇంటికి వెళ్ళి సావకాశంగా కూర్చుని ఒక అయిదు నిమిషాల్లో రెండు సీస పద్యాలు వ్రాసి, సంగ్రహంగా తన వృత్తాంతం అంతా వాటిలో ఇమిడ్చినాడు రామకవి. వాటిని చక్కగా ఒక తాటాకుమీద వ్రాయించి, అది తయారయ్యేలోగా వేగం రెండు మెతుకులు నోట్లో వేసుకుని అడ్డు దారిని కుమలి ఘాటీమీదుగా మహారాజులుంగారి దర్శనానికి విజయనగరం బయలుదేరాడు.

దారిలో ఆలోచించాడు – విజయనగరం వెళ్తూతూ వున్నామే గాని, ప్రయోజనం వుంటుందా? అని. వుంటుందని అతనికి నమ్మకం లేదు. ఏమంటే – మహారాజులుంగారి దర్శనం దొరకడం అంత సులభమైనది కాదు. రెండు మూడు రోజులు కాచుకు కూర్చోడానికి వీలులేదు. ఇవతల తన జీవనాధారం ఘడియో, క్షణమో అన్నరీతిగా ఉన్నది. ఒక వేళ వెళ్ళిన వెంటనే మహారాజావారి దర్శనం అదృష్టవశాత్తూ లభించినా – ఆ ప్రభువు దివానుగారిమీదే కార్యభారం వేసి వుంచడంచేత – దివానుగారికే మనవి చేసుకోవలసి వుంటుంది. ఇక ఆ మనవా? – చెవిటివాని చెవిదగ్గర శంఖం వూదినట్లే! ప్రజా సౌకర్యం అంటే సుతరామూ కిట్టని దివానువల్ల అయేదేమిటి? అయితే ఎందుకు వెళ్ళడం? –

ఏదో కాస్త ఆశ అనేది బాధించడంచేత!

ఇలా పరి పరి విధాల అనుకుంటూనే రామన్న విజయనగరం ప్రవేశించాడు. అతడు అనుకున్నంత పనీ అయింది.

మహారాజావారి దర్శనం దొరకడం లేదు. కాని, ఏమి మనవి చేసుకోదలచినా దివానుగారికి తెలపవలెననీ, ఆయన తగిన చర్య తీసుకుంటారనీ మాత్రం ప్రభువుల వద్ద నుంచి వర్తమానం వచ్చింది. ప్రయోజనం వుండదని తెలిసినా, దివానుగారిని చూసి, రామన్న తన గోడు వెళ్ళబోశాడు. దివానుగారు జిరాయితీ భూములను రక్షించుకోవడం ముఖ్యమనీ, వాటికి దెబ్బ తగలకుండా చూసుకుని, ఆ మీద యినాములనూ, మాన్యాలనూ చూడడం న్యాయమే అనీ, అలాంటివి రేగలో వున్న అన్నంరాజుగారే చూస్తారనీ, తమ మాటగా మరొకసారి అన్నంరాజుగారినే ప్రార్థించాలనీ దివాను సీతారామరాజుగారు చెప్పారు.

రామన్న మారుమాట చెప్పకుండా వెంటనే యింటి ముఖం పట్టాడు.

ఆయన ఇంటికి వచ్చేసరికి ఇంకా కాస్త పొద్దు వుంది. అప్పటికి అతని పొలాల్లో పీకబంటి నీరు వ్యాపించి వుంది. అది చూచేసరికి అతని గుండెలు గుభేలు మన్నవి. క్షణకాలం నిర్ఘాంతపోయి చూస్తూ రామన్న, ఒక లిప్తకాలం ఆలోచించి ఏదో ఊహ తట్టగా గబగబా యింటిముఖం పట్టాడు.

ఆ కాలంలో కరిణీకం చేసేవా ళ్ళందరూ కాస్తంత సంస్కృతాంధ్రాల్లో ప్రవేశం సంపాదించి వుండేవారు. కరిణీకం సంపాదించడానికి అదొక అర్హతగా లెక్కకు వచ్చేది. ఆ కాలపు గ్రామ కరణాల వ్రాతలోని అక్షరము లెంత తిన్నగా ముత్యాలకోవలవలె వుండి, ఆకర్షకంగా వుంటాయో వారి కవిత్వం కూడా అంత ఆకర్షకంగానే వుంటుంది. పండితకవుల వంశంలో పుట్టి వుండడంవల్ల రామన్నకు చక్కగా కవిత్వం చెప్పే నేర్పు కలదు. అతను ఉత్తమ స్వభావం కలవాడు; వాక్శుద్ధి వున్నది. మహారాజులుంగారికి అర్జీరూపంగా వ్రాసిన పద్యాలు చాలా అద్భుతంగా తయారయాయి. దానివల్ల ప్రయోజనం లేకపోగా భగవతి అయిన గంగాదేవినే ప్రార్థిద్దామని అతనికి బుద్ధి పుట్టింది. కవి అయినవాడు అంత కంటె చెయ్యగలిగింది మాత్రం ఏముంది?

రామన్న ఒక గంటాన్నీ, కొన్ని తాటాకులనూ పట్టుకొని వచ్చి, చెరువులో స్నానంచేసి, సంధ్యావందనం చేసుకుని, తన పొలంలో గుండెలబంటి నీటిలో నిలబడి గంగాదేవిని స్తుతిస్తూ, తన పొలంలోంచి వెళ్ళిపోవాలని ప్రార్థించాడు. "తల్లీ! నువ్వు విష్ణువు పాదాలనుంచి పుట్టావు; శివుని శిరస్సునెక్కావు. శంతను చక్రవర్తిని వివాహమాడావు; సముద్రాన్ని చేరావు; అట్టి నీకు యీ బీదవాని పొలంలో నిలిచిపోవడం ఎంతమాత్రమూ తగదు. దయచేసి యిక్కడినుంచి కదిలి వెళ్లిపో అమ్మా!" అని ఆ ప్రార్థన. ఇలా అర్థమయే

టట్లు చక్కని పద్యం తాటాకుమీద వ్రాసి, దాన్ని ఆ గంగలో విడిచిపెట్టాడా అమాయకుడు. తాను చిత్తశుద్ధితో ప్రార్థిస్తే గంగ కదిలిపోతుందని అతని నమ్మకం.

కాని, అలా జరగడం లేదు. గంగ మామూలుగానే వుండి పోయింది.

ఇది చూసి రామకవికి ఎక్కువ కోపం వచ్చింది. "నయాన్ని చేప్తే వినే ఘటం కాదు గంగ" అనుకున్నాడు. మర్యాదకు ఆలోచించకుండా తిడితేనే గాని కార్యం ఫలించ దనుకున్నాడు. ఇలా అనుకుని అతను గంగను నిందిస్తూ నాలుగు పద్యాలు చెప్పి, తాటాకులమీద వ్రాసి గంగలో విడిచాడు.

విడిచీ, విడవడంతోనే ఆ చెరువుగట్టు ఒక చివరభాగానికి ఒక గండి పడి గంటలో పొలంలో నీరంతా తీసివేసి చేను కలకల్లాడుతూ కంటబడింది! రామన్న దూషణకి గంగాదేవి సిగ్గుపడి, అతని తిట్లు తినలేక ఆ చోటు విడిచి పోయి వుంటుంది.

అప్పటికి ఏడుగంటలయి వుంటుంది.

కరణం రామన్న పద్యాలు చెప్పి, తన వరిపొలంలోని ముంపు తీయించివేశాడనే వార్త వూరంతా ప్రాకిపోయింది.

తన యింటి అరుగుమీద తుంగచాపమీద కూర్చుని చుట్ట కాల్చుకుంటున్న అన్నంరాజు ఈ మాట విని నిర్ఘాంత పోయాడు.

"ఏమిటో అనుకున్నాను!" కవులు ఏం తలచినా అది జరిపించి తీరుతా" రని నేను వేళాకోళానికి అన్నాను. "అది ముమ్మాటికీ నిజమే!" అంటూ "కరణం నాకు బాగా పాఠం బోధించాడు" అని అనుకున్నాడు అతను.

---

# 5. సంతృప్తి

ఆరోజు మాఘశుద్ధ ఏకాదశి. విజయనగర సంస్థానానికి చెంది వున్న రామతీర్థ క్షేత్రంలో శ్రీరామచంద్రునికి కళ్యాణ మహోత్సవం జరగవలసిన రోజు.

ఆ క్షేత్రంలో యేడాదికి గొప్పగా జరగవలసిఎ వుత్స వాలు రెండే రెండు. మొదటిది మాఘశుద్ధంలో జరిగే స్వామి కళ్యాణమహోత్సవం, రెండోది మాఘబహుళంలో వచ్చే శివరాత్రి మహోత్సవం!

వైష్ణవక్షేత్రమైన రామతీర్థానికి శివరాత్రినాడు వచ్చే పాటక జనానికి హద్దూ, పద్దూ వుండదు. అంతమంది జనం ఆ చుట్టుపక్కల వున్న ఏ క్షేత్రానికీ, ఏ వుత్సవానికీ వచ్చి వుండరు. దీనికి కారణం తెలియదు. ఆ స్థల మహాత్యం యేమిటో శ్రీరాముని దర్శనం కోసమే నాడు కుమ్ములాడు కుంటారు.

శివరాత్రినాడు వచ్చినంత జనం రాకపోయినా స్వామి కళ్యాణానికి చుట్టుపక్కల ఊళ్ళనుంచి నాగరక జనం చాలా మంది వచ్చి, రాత్రంతా మేలుకొని, కళ్యాణం చూచి, మర్నాడు ద్వాదశి పారణ చేసుకుని తమ తమ నివాసాలకు సావకాశంగా వెళ్ళడం ఒక ఆచారం.

కూర్మనాథకవి జన్మస్థలం గజపతినగరం దగ్గర వున్న దేవువల్లి అయినా, అతను తరచుగా అత్తవారి వూరు రెల్లి వలసలో వుంటూ వుండేవాడు. ఆ వూరికి రామతీర్థక్షేత్రం

సమీపంలో వుండడంవల్ల ఒకసారి దేవుని కళ్యాణోత్సవ సమయానికి అక్కడికి వెళ్ళడం తడస్థపడింది.

కూర్మనాథకవి భక్తుడు. అతనికి దేవుని వుత్సవా లంటే ఉత్సాహం అమితం. అందువల్ల స్వామి కళ్యాణం రోజున సాయంకాలమే ఫలాహారం ముగించుకొని, కొందరు మిత్రులతో కూడా బయలుదేరి జాము రాత్రికల్లా రామ తీర్థం చేరుకున్నాడు. ఇంకా తిరువీధికి కొంత వ్యవధి ఉండ డంవల్ల దేవాలయంలో ధ్వజస్తంభ సమీపంలో ఒకచోట కూర్చుని భగవన్నామసంకీర్తన చెయ్యసాగాడు. కళ్యాణ మహోత్సవం చూడవచ్చిన భక్తబృందం అతని చుట్టూ చేరి తన్మయులై వినసాగారు.

ఇంతలో దేవాలయంనుంచి ఆజ్ఞదివిటీలు బయలుదేరి అయ్యవార్లంగారి భవంతికి వెళ్ళాయి. ఈ దేవాలయంలో ఇదొక సంప్రదాయం. దేవాలయంలో జరిగే నిత్యోత్స వాదులకున్నూ, విశేషోత్సవాలకున్నూ కూడా శ్రీ అయ్య వార్లంగారి అనుజ్ఞ అవసరం. అందువల్ల ఏ కార్యమైనా ప్రారం భించేముందు పగటిపూటా, రాత్రిపూటా కూడా వారి అను మతి కావాలి. శ్రీ అయ్యవార్లంగారు దేవస్థానం ధర్మ కర్తలైన విజయనగరం ప్రభువులకు మతగురువులైనం దున-గురువులయెడ ఉండే గౌరవంకొద్దీ ధర్మకర్తలు ఎప్పుడో యీ ఏర్పాటుచేసి ఉన్నారు. అయ్యవార్లంగారు కూడా ఎప్పుడూ ఎట్టి అభ్యంతరమూ చెప్పకుండా అనుమతిని

యిస్తూవుండడమున్నూ ఆచారమే! ఈ ఆచారం కూర్మనాథకవికి కొంత వింతగా తోచింది. ప్రభువులు అంత గొప్ప గౌరవం చూపే వ్యక్తి సామాన్యుడై ఉండడం సంభవం కాదని అతని కప్పుడే అయ్యవార్లంగారి మీద గురి ఏర్పడింది. స్వామి తిరువీధి వేంచేసినప్పుడు కూర్మనాథుడు కూడా వాహనముల వెంట వెళ్ళి, శ్రీ అయ్యవార్లంగారి భవంతిముందు జరిగిన ఎదురు సన్నాహాల సేవలోని విశేషాలు పరికిస్తూ, శ్రీ అయ్యవార్లంగారు పీతాంబరాలతో వచ్చి భగవంతుని సేవించి, అక్కడ జరపవలసిన విధులను సక్రమంగా జరిపించడం కళ్లారా చూశాడు. ఆయన స్ఫురద్రూపమూ, తేజస్సూ కూర్మనాథకవిని ఆకర్షించాయి. ఆయన సంస్కృతంలోనూ, ద్రావిడాగమాల్లోనూ మహా విద్వాంసులని యిదివరకే విని వుండడంవల్ల ఆయనయెడ యదృచ్ఛగా అతనికి గురుభావం కూడా ఏర్పడింది.

దేవాలయంలో కళ్యాణోత్సవం జరిపించడంలో శ్రీ అయ్యవార్లంగారు ప్రముఖపాత్ర వహించడం, ఉత్సవం దివ్యంగా జరగడం కూర్మనాథకవిని ఆనందంలో ఓలలాడించాయి. ఉత్సవం పూర్తి అయేసరికి తూర్పుదిక్కున తెల్లని రేఖలు వ్యాపించాయి. కూర్మనాథకవి రామగుండంలో స్నానం చేసి, ఆ పూట అక్కడ ఆగి అయ్యవార్లంగారి దర్శనం చేసుకుని, ద్వాదశి పారణ చేసుకుని రెల్లివలసకు వెళ్లాలనుకున్నాడు.

కూర్మనాథకవికి అయ్యవార్లంగారి దర్శనం సులభం గానే లభించినది. ఆయనను చూడగానే కవి సాష్టాంగ నమస్కారం చేసి, ఆయన కోరికపై ఒక చాపపై కూర్చున్నాడు.

కుశలప్రశ్నలూ, అవీ అయాక శ్రీ అయ్యవార్లంగారు కవి పుట్టు పూర్వోత్తరాలూ, విద్యాకృషీ మొదలయినవి తెలుసుకుని, తనవల్ల ఏమి కావలసినదీ తెలుపవలె నని అడిగారు.

అయ్యవార్లంగారు సాత్వికమూర్తులూ, మహావిద్వాంసులూ అయినందున – ఆ వూరికి వచ్చీ కూడా వారిని దర్శించకుండా వెళ్లిపోవడం యిష్టంలేక కవి వారిని దర్శించా లనుకున్నాడు కాని, ప్రయోజనం ఏదీ అపేక్షించి కాదు. అయినా యింతసేపూ ఆయనతో ప్రసంగించడంవల్ల నైతే నేమి, అయ్యవార్లంగారే కోరి అడగడంచేత నైతేనేమి ఒక చిన్న కోరిక కోరాలని తోచింది అతనికి.

కూర్మనాథకవి యీావరకు స్వగ్రామంలో ఆంధ్రంలో కొంత కృషి చేసి, మంచి ప్రవేశం సంపాదించుకున్నాడు. కాని సంస్కృతంతో పరిచయం లేదు. తెలుగు ప్రబంధాల్లో వచ్చే సంస్కృతపదాలకు తప్ప, తక్కిన వాటికి అతనికి అర్థం కూడా తెలియదు. అతనికి సంస్కృతంలో మంచి ప్రవేశం సంపాదించాలనే కోరిక చాలా కాలంనుంచీ వున్నది. కాని స్వగ్రామంలోగాని, అత్తవారి వూరులోగాని సంస్కృతం

వచ్చేననారు లేనందున కోరిక యింతవరకూ నెరవేరడం లేదు. శ్రీ అయ్యవార్లంగారితో ప్రసంగించిన పిమ్మట యీ వూళ్లోనే వుండి ఆయన దగ్గర సంస్కృతం నేర్చుకోవాలనే అభిలాష కలిగింది. శ్రీ అయ్యవార్లంగారే కోరి అడగడం చేత కూర్మనాథకవి తన కోరికను యిలా వెల్లడించాడు.

"తమకు నా యందు యిలా వాత్సల్యం వున్నందుకు చాలా ధన్యుణ్ణి. నేను బాల్యంలో తెలుగులో కొంచెం కృషి చేసేనేగాని, సంస్కృతం బొత్తిగా ఎరుగను. సంస్కృతంలో ప్రవేశం ఉంటేనే కాని, నా కవిత్వం రాణించదు. తమరు కటాక్షించి ఆ విద్యాదానం చేస్తామని అభయమిస్తే, యీ క్షేత్రంలో వుండి మధుకరం ఎత్తో, వారాలు చేసుకునో, తమ శుశ్రూష చేస్తూ వుంటాను."

చదువుకుందామని కోరిక కలవాళ్లను చూస్తే శ్రీ అయ్యవార్లంగారికి అపరిమితమైన అభిమానం; అందు లోనూ, సంస్కృతం నేర్చుకునే వాళ్లయందు ప్రత్యేకాభి మానం; కూర్మనాథకవి యిలా కోరేసరికి ఆయనకు చాలా సంతోషం కలిగింది.

నాయనా! చాలా సంతోషం; నీకు సంస్కృతం నేర్చు కోవాలనే కోరికే వున్నట్లయితే చెప్పడానికి మాకు ఎంత మాత్రమూ అభ్యంతరం లేదు. ఒక భాషలో మంచి ప్రవేశం వున్నవారికి మరో భాష చాలా సులభంగానే వస్తుంది. అందులోనూ తెలుగులో మంచి ప్రవేశం ఉన్న

వారికి సంస్కృతం నేర్చుకోవడం సులభం. నీకు సంస్కృతం నేర్పడానికి ఆనందంతో అంగీకరిస్తున్నాను. నువ్వు అందులో మంచి ప్రవేశం సంపాదిస్తే, మునుముందు మంచి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించగలుగుతావు. ఆర్థికంగా కూడా మంచి భవిష్యత్తు వుంటుంది.

"మరొక సంగతి. విద్యాభ్యాస కాలంలో భోజనానికి నువ్వు ఎట్టి శ్రమా పడవలసిన అవసరం లేదు. మా లోగిట్లో పూటకు పదిమందికి ఆతిథ్యం యియ్యబడుతూ వుంటుంది. నువ్వు ఎంతకాలం చదువుకున్నా మా యింట్లోనే వుండ వచ్చు."

ఆయన ఇలా అనేసరికి కూర్మనాథకవి రెండు కన్నుల నుండి రెండు ఆనందబాష్పాలు రాలాయి. అతను అయ్యవార్లంగారికి కృతజ్ఞతాసూచకంగా నమస్కరించి "తమ అనుగ్రహంవల్ల నేను ధన్యుణ్ణి అయినాను. నా జన్మ తరించినది" అన్నాడు.

తర్వాత శ్రీ అయ్యవార్లంగారిలా అన్నారు —
"ఒక చిన్న సంగతి; నీవు కవివి కావడంచేత చాలా చాలా పద్యాలూ, పుస్తకాలూ వ్రాయవచ్చును. సంస్కృతాభ్యాసంతో తప్పకుండా గొప్ప కవివి కాగలవు. ఏమైనా గ్రంథాలు వ్రాసి, ధనాశవల్లనో, తదితర కారణాలవల్లనో, మనవాళ్లు చాలామంది తమ గ్రంథాలను నరాంకితాలు చెయ్యడం కద్దు. కాని నువ్వుమాత్రం అలా చెయ్యవద్దనీ,

ఏవి వ్రాసినా, దైవపరంగానే వ్రాయాలనీ నా కోరిక. ఆ కోరికను నువ్వు వ్యర్థం చెయ్యవని నమ్ముతున్నాను.

"తమరు నా మనస్సులో ఉన్నదే సెలవిచ్చారు. ఏమి వ్రాసినా, భగవత్పరంగా వ్రాయాలనీ, నరాంకితంగా వ్రాయరాదనీ నా ప్రతిజ్ఞ, తమ మాట నా పట్టుదలకు దృఢత్వాన్నీ, నాకు ధైర్యాన్నీ కలిగించింది. నేనింతవరకూ నరాంకితంగా ఒక పద్యమైనా వ్రాయలేదు."

అని తెల్పి కూర్మనాథకవి అయ్యవార్లంగారివద్ద సెలవు తీసుకుని, మంచిరోజు చూసుకుని వస్తానని స్వగ్రామానికి వెళ్ళిపోయాడు.

శ్రీరామ తీర్థక్షేత్ర నివాసులూ, సంపన్న గృహస్థులూ, విజయనగర ప్రభువుల మత గురువులూ అయిన శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమార వెంకటాచార్యులయ్యవార్లంగారివద్ద శిష్యరికం చేస్తూ కూర్మనాథకవి అచిరకాలంలోనే సంస్కృతంలో మంచి పాండిత్యం సంపాదించాడు. అతని కుశాగ్రబుద్ధీ, వినయ విధేయతలూ అయ్యవార్లంగారి హృదయాన్ని బాగా ఆకర్షించాయి. ఆయన ఇతనిని తన బంధువులకంటే కూడా ఎక్కువ అభిమానంతో చూస్తూ, తాను ఎక్కడికి వెళ్ళినా వెంటపెట్టుకుని వెళ్ళేవారు.

శ్రీ అయ్యవార్లంగారు విజయనగరం మహారాజులుంగారికి గురువులు కావడంవల్ల అప్పుడప్పుడు మహారాజులుం

గారి దర్శనానికి విజయనగరం వెళ్ళడం తటస్థించేది. అప్పుడు శిష్యుడు కూర్మనాథకవికి కూడా గురువుగారితో పాటు విజయ రామ ప్రభువుల దర్శనం లభించేది. శ్రీ అయ్యవార్లంగారు తమ శిష్యుని శక్తి సామర్థ్యాలను గురించీ, వినయ విధేయత లను గురించీ ప్రసంగవశాత్తూ ప్రభువులకు తెలియజేసేవారు. ఈ విధంగా ప్రభువులకు కూడా కూర్మనాథకవి మీద అభిమానం కలిగింది; దానికి ఫలితంగా కూర్మనాథకవి విజయనగర ప్రభు వుల ధర్మ కర్తృత్వంక్రింద వున్న శ్రీ రామతీర్థం, శ్రీ కూర్మం, పద్మనాభం, సింహాచలం మొదలయిన క్షేత్రాలలో అజమా యిషీ చెలాయించే అధికారిగా నిర్ణయింపబడ్డాడు. దీనివల్ల కవికి స్థిరమయిన జీవనోపాధి కలిగింది. అతడు రామతీర్థంలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని, తరచుగా తక్కిన క్షేత్రాలకు కూడా వెళ్లుతూ తన ఉద్యోగధర్మాన్ని నెరవేరుస్తూ వుండే వాడు. తాను భగవంతునిమీద కూర్చిన పాటలూ, పవ ళింపుసేవా, లక్ష్మీనారాయణ సంవాదమూ క్షేత్రా లన్నిటి ల్లోనూ నిత్యమూ సంకీర్తన చేసేటట్లు ఏర్పాటు చేశాడు. కళ్యాణోత్సవములలో రథోత్సవం మర్నాడు చోరసంవాదం గానం చెయ్యడానికిన్నీ ఏర్పాటులు జరిగాయి. ఈ విధంగా కూర్మనాథకవి కవిత్వం ఆ ప్రాంతాలలో, మంచి ప్రచారానికి వచ్చింది.

అయితేనేం ? ఒకరి పచ్చ చూసి ఓర్వలేనివారు చాలామంది వుంటారు. కూర్మనాథకవికి ఎలాగయినా

సంస్థానం ప్రాపకం పోగొట్టాలనీ, ఉద్యోగం ఊడదీయించా లనీ కొందరు ప్రయత్నించారు. మొట్టమొదట అతని గురువు లైన అయ్యవార్లంగారికి అభిమానం తప్పించడానికి సర్వ విధాలా యత్నించారు. కాని లాభం లేకపోయింది. తర్వాత ప్రభువుల దయకు అతడు దూరం అయేటట్లు చెయ్యడానికి విజయనగరం వెళ్ళి ప్రయత్నించడానికి పూనుకున్నారు.

వారు ప్రభువులదగ్గర వుండే దారూగాలను ఆశ్రయించి, వాళ్లకు లంచాలిచ్చి, వాళ్ల మూలంగా ఈ మహాకార్యం నెరవేర్చడానికి తగిన ఏర్పాట్లు జరిపారు. దానికి కీలకం కని పెట్టక పోలేదు. కూర్మనాథకవి ఏమి వ్రాసినా భగవత్ప రంగానే వ్రాస్తాడనీ, అయ్యవార్లంగారు కూడా ఆ విధంగానే వ్రాయాలేగాని, దేన్నీ నరాంకితం చేయరాదని ఆదేశించారనీ అందరికీ తెలుసును. ఈ విషయం ఆధారంగా చేసుకుని, అతడు ఏ గ్రంథాన్నీ మహారాజులుంగారికి అంకితం చెయ్య దలచుకోలేదని అతనిమీద నేరం మోపుతూ, ఆ వార్త మహారాజులుంగారి చెవిలో పడేటట్లు చేశారు. ఈ సంగతి మొదట ప్రభువులు పట్టించుకోక పోయినా, రెండు మూడు సార్లు ఆ సంగతే చెవిని పడడంవల్ల అదేమిటో పరీక్ష చెయ్యాలనే కోరిక ప్రభువులకు కూడా కలుగక పోలేదు.

ఇది జరిగిన వారం రోజులకు శ్రీ అయ్యవార్లంగారు ప్రభువుల దర్శనానికి వెళ్ళడమూ, అప్పుడు ఆయన వెంట కూర్మనాథకవి కూడా వుండడమూ తటస్థపడింది.

కొంచెంసేపు యిష్టాగోష్ఠి జరిగిన తర్వాత విజయ రామప్రభువు చిరునవ్వు నవ్వుతూ కూర్మనాథకవిని చూసి "కవిగారూ! మీ కవిత్వం చాలా అద్భుతంగా వుంటుందనీ, భక్తిరసం తొణికిసలాడుతూ వుంటుందనీ విన్నాం. మీవంటి కవులకు శృంగారరసంలో కూడా అలా కవిత్వం చెప్పడం కష్టతరం కాదనుకుంటాను. మా సంస్థానంలో "సుందరీ మణి" అనే పేరు గల నట్టువకత్తె - ఒకతె వున్నది. ఆమె సౌందర్యంలోనూ, సంగీతంలోనూ కూడా పేరుపడింది. ఆమె మీద ఒక శతకం రచించాలని మా కోరిక" అన్నారు.

ఈ మాటలు విని కూర్మనాథకవి నిర్ఘాంతపోయాడు. ఒక క్షణం ఏమి జబాబు చెప్పడానికి అతనికి పాలుపోలేదు. ప్రభువులు కోరినట్లు శతకం చెప్పితే తన ప్రతిజ్ఞ భగ్నమవు తుందనీ, అలా చెప్పకపోతే తన జీవికకే భంగం కలుగుతుం దనీ అతడు గ్రహించకపోలేదు. తర్వాత కొంచెం ఆలోచించి, సుందరీమణిమీద శతకం చెప్పితే అది నరాంకితం చేసినట్లు కాదనీ, ఒక వలపుకాడు తన వలపుకత్తెమీద వున్న వ్యామోహాన్ని వెల్లడించినట్లు మాత్రమే అగుననీ ఆ వలపు కాడు కృష్ణునివంటివాడు కావచ్చుననీ, ఇంతకూ సుందరీమణి అంటే అందకత్తెల్లో ఉత్తమురాలని ఏల అనుకొకూడదనీ, మనస్సును సమాధానపరచుకుని, గురువుగారివైపు చూసి, వారి భావాన్ని గ్రహించి ప్రభువులతో "చిత్తం! ప్రభువుల ఆజ్ఞప్రకారం తప్పకుండా శతకం వ్రాసి దాఖలు చేసు

కుంటాను" అని మనవిచేసి, ప్రభువులకు సంతృప్తి కలిగించాడు. అంతేకాదు. వారంరోజుల్లో శతకాన్ని తయారు చేసి, ప్రభువుల యెదుట చదివి, వినిపించి వారి మన్ననకు పాత్రుడైనాడు.

తమ ప్రయత్నం నిరర్థక మైనందుకు ప్రతిపక్షులు చాలా బాధపడ్డారు. ఆర్థికంగా తమకు చిక్కులు వచ్చినా సరే - దారూగాలను బాగా సంతోషపెట్టి, వాళ్ళ మూలంగానే తమ పట్టుదలను నెరవేర్చుకోవాలని వాళ్లు నిశ్చయించుకున్నారు. దానికి తగిన ఆలోచనలున్నూ జరిగాయి. సుందరీ మణిశతక రచనంవల్ల కూర్మనాథకవి తన గ్రంథాన్ని మానవాంకితం చేసినట్లు ఎంతమాత్రమూ కాదని అందరూ అన్నారు. శ్రీ అయ్యవార్లంగారూ ఆ విషయాన్నే సూచించారు.

ఈ సంగతే దారూగాల ప్రచారం కారణంగా ప్రభువులకున్నూ తెలిసింది. కూర్మనాథకవి పోతన వంటివాడనీ, పోతన్న భోగినీదండకం చెప్పినట్లు యితడున్నూ సుందరీమణి శతకం చెప్పాడనీ, ఆ విధంగానే తన రచనలు భగవదర్పితం చేస్తాడే గాని ప్రభువుల కంకితం చెయ్యడనీ, ఎవరేమి చెప్పినా లక్ష్యం చెయ్యడనీ మహారాజులుంగారికి తెలిసింది. ఎలాగయినా అతనిచేత స్వనామాంకితంగా గ్రంథాన్ని కృతి పొందాలని ప్రభువులకు పట్టుదల కూడా హెచ్చింది.

కూర్మనాథకవి రామతీర్థంలో వుండగా ఒకనాడు

అనుకోకుండా హుజూరు జవాను వచ్చి "శీఘ్రంగా వచ్చి దర్శనం చేసుకోవాలని మహారాజులుంగారి ఆజ్ఞ" అని తెలియజేశాడు.

ఎప్పుడో ఒకప్పుడు ఇలా ఉపద్రవం కలుగుతుందని కవికి ఇదివరకే తెలుసును. అసూయాపరులు ఇదివరలో పన్నిన కుట్రలూ, ఇప్పుడు పన్నుతున్న పన్నుగడలూ చూచాయగా అతనికి తెలుసును.

కూర్మనాథకవికి కొంత అధైర్యం కలిగింది. వెంటనే అయ్యవార్లంగారిని దర్శించాడు. "మరేం ఫర్వాలేదులే" అని ధైర్యం చెప్పి, దీవించి పంపించా రాయన.

విజయరామ గజపతి ప్రభువు కూర్మనాథకవిని మిక్కిలి గౌరవించి "కవిగారూ! మీ కవిత్వం రసవంతమైనది. భక్తిభావంలోనే కాకుండా శృంగారరసంలో కూడా మీరు అత్యంత సమర్థులు. మీ కవితాశక్తిని బట్టే మళ్ళీ మీ కొక చిన్న శ్రమ కలిగించవలసి వచ్చింది. మాది ఒకే ఒక్క చిన్న కోరిక. ఏ విషయమైనా సరే - మీరు చిన్న కృతి రచించి - అది మాకు అంకితం అయ్యేటట్లు - పద్యాల్లో మా పేరు వుండేటట్లూ కూర్చాలి. ఇలా చేస్తే చాలు; మరి మిమ్మల్ని ఎప్పుడూ నిర్బధించము" అని ప్రార్థించేసరికి కవి కొంచెం చకితుడయ్యాడు. ఇలా జరుగుతుందని అతనికి ముందే తెలుసును. దానికి తగిన పై యెత్తుతోనే అతడు ప్రభు దర్శనానికి వచ్చాడు. ఒక్కక్షణం మాత్రం

ఆలోచించి "చిత్తం మహాప్రభూ! ప్రభువుల ఆజ్ఞను చెల్లించడం ఆశ్రితుల పరమధర్మం. తమ పేరు ప్రతి పద్యంలోనూ వచ్చేటట్టు నీతుల్ని బోధించే శతకం వొకటి వారం రోజుల్లో రచించి దాఖలు చేసుకుంటాను" అని మనవిచేసి, సెలవు తీసుకుని వెళ్ళి వారం దినాల్లో '(శ్రీ) విజయరామా! రామ తీర్థాశ్రమా!' అనే మకుటంతో ఒక శతకం రచించి నిండు సభలో చదివి ప్రభువులకు సమర్పించాడు.

దీనితో అసూయాపరులందరూ ఆకాశా న్నందుకున్నారు తమ ప్రయత్నం ఫలించినదనీ, కూర్మనాథ కవికి ప్రతిజ్ఞాభంగం అయినదనిన్నీ. తమ కోరిక నెరవేర్చినందుకు ప్రభువులుకూడా కవిని గొప్పగా సన్మానించారు. కూర్మనాథకవి ఎట్టి కలతపాటూ లేకుండానే బహుమానాలతో ఇల్లు చేరుకున్నాడు.

రెండురోజులు గడిచాయి.

కూర్మనాథకవిలో ఎట్టిమార్పూ లేకపోవడం విరోధులకు ఆశ్చర్యం కలిగించింది. చేసేది లేక అతడు మొండికెత్తినట్లు వాళ్ళు ఊహించారు. కవిని అతని గురువుగారి యెదుటే హేళన చెయ్యాలనే కోరికతో కొందరు అయ్యావార్లంగారివద్దకు వెళ్ళి "చూశారా? మీ శిష్యుడు చేసిన పని? ఏ గ్రంథమూ నరాంకితం చెయ్యకూడదని చెప్పిన మీ మాటను మొదటవినీ, దానికి సమ్మతించీకూడా తోసివేసి, ప్రభువులకు గ్రంథం అంకితమిచ్చాడు. తగిన శిష్యుడండీ!"

అని నవ్వుతూ అన్నారు.

ఆ మాటలకు అయ్యవార్లంగారు ఆశ్చర్యాన్ని నటిస్తూ "ఏమీ? అలా జరిగినట్లు మాకు తెలియలేదే!" అని అన్నారు.

"మీకు తెలియనే లేదా? ఈ మహానుభావుడు 'విజయరామా! రామతీర్థాశ్రమా?' అనే మకుటంతో శతకం వొకటి రచించాడు కదా! అది విజయరామ ప్రభువులకు అంకితం కాదంటారా?"

"అంకితం అని యెవరన్నారు? అది మన క్షేత్రదేవత అయిన శ్రీరాములవారిని గురించిన సంబోధన గదా! ఆ శతకం దేవాంకితము కాదూ?"

"అయితే ప్రభువుల పేరుతో వున్నా వారికి అంకితం కాదని మీ అభిప్రాయమా?"

"ఇందులో నా అభిప్రాయం అంటూ ప్రత్యేకంగా యేమీ లేదు. అందరి అభిప్రాయమూ అంతే; ఒక్కొక్క పదానికి అనేకార్థాలైన అర్థాలు రావడం ఆ పదంయొక్క లోపం కాని కవిలోపం కానే కాదు. ఒక్కటి చెప్పండి, మనది 'రామతీర్థం!' అంటే యిది బలరాముడితీర్థం కాదా అని మీరు వాదిస్తారా?"

ఈ మాటలకు వాళ్ళు నిశ్చేష్టులయ్యారు.

"మరి యీ శతకం ప్రభువుల కంకితం అని గ్రంథకర్తే ప్రభువులయెదుట ఒప్పుకున్నాడట!"

"ఎవరన్నారో చెప్పండి. కూర్మనాథుడు 'ప్రభువుల పేరు వచ్చేటట్లు పద్యాలు వ్రాస్తానన్నాడు. గాని, ప్రభువులకు అంకితంగా వ్రాస్తానని చెప్పనే లేదు ; అలా వ్రాయనూ లేదు. విజయరామప్రభు వంటే మన రాముడు కాడని మీారనగలరా ? సెలవివ్వండి."

దీనికి వాళ్లు సమాధానం చెప్పలేక ముక్కు మీాద వేలు వేసికొన్నారు.

మళ్ళీ ప్రయత్నించడం సాధ్యంకాదు. ఏమంటే - ప్రభువులు 'యీా ఒక్క కోర్కె తీర్చ'మన్నారు, కవిని ? దానితో తృప్తి పడ్డారు.

ప్రభువులూ సంతృప్తిపడ్డారు.

కవికీ సంతృప్తి కలిగింది.

---

# 6. ప్రతిక్రియ

బొబ్బిలి యుద్ధం జరిగిన తర్వాత చాలా కాలంవరకూ విజయనగరం ప్రభువులకూ, బొబ్బిలి ప్రభువులకూ మనస్సులలో విరోధభావం రగులుతూ వుండేది. కాని ఆ యుద్ధం జరిగిన తర్వాత జరిగిన సంఘటనలవల్ల నైతేనేమి, ఫ్రెంచివారూ, బ్రిటిష్‌వారూ మొదలయినవారి సలహాలవల్ల నైతేనేమి పరస్పరం యీ రెండు సంస్థానాలూ యుద్ధానికి మాత్రం దిగడం లేదు.

ప్రభువుల సంగతి అలా వుంచి—ప్రజల సంగతి గమనిస్తే—ఉద్రేకం హద్దు మీరి వుండేది. ఆ ప్రాంతంవారిని చూస్తే యీ ప్రాంతంవారూ, యీ ప్రాంతంవారిని చూస్తే ఆ ప్రాంతంవారూ ఈసడిస్తూ వుండడం, అధిక్షేపించడం జరిగేది. ప్రభువులు వూరుకున్నా, ప్రజలు మాత్రం వూరుకోనివ్వకుండా ఏవో పేచీలు పెడుతూనే వుండేవారు. ఒక ప్రాంతానికి యింకొక ప్రాంతంవారు వెళ్ళి ఎలాంటి అవమానమూ పొందకుండా రావడమంటే ఘనకార్యం చేసి వచ్చినట్లే భావించబడేది.

ప్రజల మాటకి ప్రభువులు మాత్రం ఉద్రిక్తులు కాకుండా, ప్రజలను శాంతపరుస్తూ, తాముస్నూ గొప్ప శాంతాన్ని వహించి వుండేవారు! పరస్పరం స్నేహభావాన్ని ప్రదర్శిస్తేనే ఉభయులకూ మేలనీ, లేకపోతే విరోధాలు

పెచ్చుపెరిగి తిరిగీ యుద్ధం సంభవిస్తే యీసారి రెండు రాజ్యాలూ పతనం కావడమూ, విదేశీయులు వాటిని ఆక్రమించడమూ జరగవచ్చుననీ, అది ఉభయులూ కోరదగినది కాదనీ వారికి తెలుసు. పౌరుషానికి తమదే పెట్టిన పేరని బొబ్బిలి ప్రాంతీయులు తలచుకునేవారు; ఒకసారి విజయనగరం వెళ్ళి, అక్కడి ప్రభువులకు అవమానకరంగా ప్రవర్తిస్తేనే గాని తమకు తృప్తి కలుగదని అందుకు తగిన ఉపాయాన్ని ఆలోచింపసాగారు. అందులో ఒక మొనగాడు బాగా ఆలోచించి, తాము విజయనగరంకోట సింహద్వారంవైపు రోడ్డుమీద తమ ప్రభువుల పతాకతోనూ, ఢంకా నౌబత్తులతోనూ వెళ్ళితే అదే చాలుననీ, అలా చేస్తే విజయనగరంవారిని అవమానించినట్లవుతుందనీ, తన సహచరులతో చెప్పాడు.

అతడు ఆలోచించినదీ సరియైనదే! విరోధులు పతాకలతోనూ, మేళతాళాలూ, ఢంకా నౌబత్తులూ మున్నగు వాటితోనూ తమ కోట సింహద్వారం ముందునుంచి సాగనీయడం ఎవ్వరికయినా తల కొట్టినట్లే.

ఇలా చేస్తే ఆ తర్వాత జరిగే పరిణామాలను కూడా అతడు ఊహించాడు. ఎదుటివారు పౌరుషవంతులయితే, వెంటనే అటకాయిస్తారు. తర్వాత పరస్పర కలహం జరుగుతుంది. అది యుద్ధంగా పరిణమిస్తుంది. వారు కోరినది కూడా అదే!

లేదా ఎదుటివారు ఊరుకుంటే మరీ మంచిది! దాని వల్ల తాము తలచిన కార్యం నెగ్గుతుంది. ఎదుటిపక్షం ప్రభువును అవమానించినట్లూ అవుతుంది. అందువల్ల తమకు ఎక్కువ తృప్తి కలుగుతుంది. ఒక వేళ యుద్ధమే సంభవిస్తే సహాయం చెయ్యడానికి విదేశీయులు కాచుకుని వుండనే వున్నారు!

ఈ ఆలోచన ప్రభువువారి చెవిలోనూ పడినది. ఆయన ప్రోత్సాహకరంగా గాని, నిరుత్సాహకరంగా గాని ఏమీ చెప్పడం లేదు. "మీ రేమి చేసుకుంటారో మాకు తెలియదు. మాకు మాత్రం దీనితో సంబంధం కలిగించుకోవడం ఇష్టంలేదు. మీరు ఎలా ప్రవర్తించినా మీ స్వంత బాధ్యతమీదనే నడుచుకోవలసి వుంటుంది" అని ఆయన చెప్పారు. ఆ ఆలోచనదారులకు కావలసిన యేర్పాట్లన్నీ జరపడానికి గాని, కావలసిన వస్తువులను సరఫరా చేయడానికి గాని ఏమీ అభ్యంతరం కలగలేదు.

ఈ మహాకార్యం ఉపక్రమించడానికి తగిన సుముహూర్తం కూడా నిర్ణయింపబడింది!

బొబ్బిలివారి బలగం కొంత ఒక రీతి దాడిగానే విజయనగరం మీదికి రావడానికి బయలుదేరినదనే సంగతి చారుల మూలంగా విజయనగరానికి తెలిసింది. విజయనగరంవారిని అవమానించడమే ఎదుటి పక్షమువారి ముఖ్యోద్దేశం అనే విషయం వివరంగా కూడా క్రమంగా తెలిసింది.

విజయనగర ప్రభువులకు ఏమీ తోచలేదు. శత్రువులను ఎదిరించడం అంత కష్టం కాదు. ఎదిరిస్తే ఎలాంటి పరిణామాలేర్పడుతాయో! ఇంకా ఎలాంటి చిక్కులను ఎదుర్కోవలసి వస్తుందో అని ఆయన తన మనస్సులోనే చాలా బాధ పడ్డారు.

ఆయన ముఖ్యులైన కొందరితో ఆలోచించారు. పలువురు పరిపరి విధాల తమ అభిప్రాయాలను వెల్లడించారు. కాని వాటిలో ఒకటిన్నీ ప్రభువులకు నచ్చలేదు.

అప్పుడు ఆజానుబాహుడైన ఒక బలశాలి, ప్రభువుల యెదుట ముకుళిత హస్తాలతో నిలిచి "ప్రభువువారు అనుమతిస్తే దానికి తగిన ప్రతిక్రియ నేను చేస్తాను. మనకు ఎలాంటి అగౌరవం, అవమానం కలగకుండా చూస్తాను" అని అన్నాడు.

అతడు రామమూర్తి అనే పేరు గల ఒక బ్రాహ్మణ యువకుడు. గొప్ప బలశాలి. మంచి లక్ష్యసిద్ధి కలవాడు. అనేక బలప్రదర్శనాల్లో ప్రభువులయొక్క మన్ననలను పొందిన వీరుడు. అయ్యకోనేరు తూర్పుగట్టునుంచి పడమటి గట్టుదాకా – అది కప్పవలె నిండి భయంకరంగా వున్న సమయంలో – అవలీలగా యీది వచ్చిన గజయీతగాడు! బలానికి తగిన ధైర్యసాహసాలు కలవాడు. ముందేమి వస్తుందో అనే ఆలోచన అతనికి లేదు. తాను సంకల్పించినది – నెరవేరి తీరవలసినదే!

అతడు ముందుకు రావడం చూచి ప్రభువులు చాలా సంతోషించి, "రామ్మూర్తీ! నీవు గొప్ప ధైర్యసాహసాలు కలవాడవని మాకు తెలుసు. ఎదుటివాళ్లను ఓడించడం నీకు ఒక పెద్ద ఘనకార్యం కాదు. నీకు తగిన మరికొందరిని సహాయంగా ఇస్తాము. ఈ విషయంలో నీవు అనుకున్న పద్ధతి ఏమిటో తెలియచెయ్యి" అన్నారు.

రామమూర్తి చేతులు జోడించి నిలుచునే "ప్రభువుల దయ ఉంటే చాలును. నాకు ఎవ్వరి సహాయమూ అక్కరలేదు. మేం పది మందిమి వుంటే వాళ్ళని ఎదిరించడం తప్ప మార్గాంతరం వుండదు. అప్పుడు పోట్లాట తప్పదు. అది క్రమంగా చిన్న యుద్ధంగా మారుతుంది. అలా జరగాలనే విరోధులు యీ పద్ధతిని అనుసరించారు. ఇంతకూ వాళ్లు మనకు అవమానం కలిగించాలనే అభిప్రాయంతోటే వస్తున్నారు. అందువల్ల ఆ కాస్తా వాళ్లకే ముట్టజెప్పి పంపివేస్తే మరి ఎన్నడూ యీ వైపు చూడగోరినా చూడరు. నాకు ఎవ్వరి సాయమూ అక్కరలేదు. నాకు కావలసిన పరికరాలను ఇస్తే చాలును. భగవదనుగ్రహంవల్ల సాధించగలననే ధైర్యం వున్నది. నేను ఏమి చేసేదీ యిప్పుడే నలుగురికీ తెలిస్తే రసాభాసం అవుతుంది. నా సంకల్పం నెరవేరదు. కావున దాన్ని వెల్లడించడం మేలు కాదు. ప్రభువులు క్షమించాలి" అని మనవి చేశాడు. "సరే! నీ యిష్టం" అని ప్రభువులు తమ సమ్మతిని ప్రకటించారు.

*        *        *        *

ఆ రోజు విజయనగర సంస్థానానికి గొప్ప పరీక్ష దినం!

తాము మహా ఠీవిగా తమ పతాకాలతోటీ ఢంకా, నౌబత్తులతోటీ, బాజా భజంత్రీ మేళాలతోటీ కోట సింహ ద్వారం వున్న వీధిలో ప్రయాణం చేసి, తమ సంకల్పం నెర వేర్చుకోవటానికి బొబ్బిలి బలగం నాటి ఉదయానికే తగిన బందోబస్తుతో వచ్చి కోట వెనుక వున్న మైదానంలో బస చేసి, తమ ప్రయత్నానికి తగిన సరంజామా చేసుకుంటున్నది.

వీళ్లు ఎందుకు వచ్చినదీ కొద్ది నిమిషాల్లోనే ఊరం తటా తెలిసిపోయింది. దీనికి తగిన ప్రతిక్రియకోసం ప్రభు వులు అణుమాత్రమూ ప్రయత్నించినట్లు కానరాదంటూ ప్రజలలో గుసగుసలు బయలుదేరాయి.

అనుకున్న విధంగానే సమస్తమైన వస్తువులతోనూ ప్రతిపక్షుల బలగం కోటపాణిద్వారం రోడ్డు పుచ్చుకుని ఉత్తరముఖంగా బయలుదేరి, కోటకు వాయవ్య మూలగా వున్న బురుజు ప్రక్కనుంచి తూర్పుముఖంగా ప్రయాణం సాగించింది. బాజా, భజంత్రీల మోతలు మిన్ను ముట్టాయి. ప్రజ లందరికీ ఆశ్చర్యం కలిగింది. ఎవ్వరి ముఖంలోనూ గంటు వేసినా నెత్తురుచుక్క కానరాలేదు. ఆ పటాలం ఆ విధంగా ప్రయాణం చేసి, యీశాన్యమూల బురుజును - అంటే - పతాక మెగురుతూ వున్న బురుజును దాటి దక్షిణ

ముఖంగా కొద్ది గజాలు ప్రయాణం చేసిందంటే సింహ ద్వారం వస్తుంది. దాన్ని నిరాటంకంగా దాటిపోయినట్ల యితే అగౌరవం పూర్తిగా కల్గినట్లే!

మరొక పావుగంటకల్లా ఆ సంఘం ఈశాన్యపు బురుజును చేరుకోగలదు. దాని ఆర్భాటం అంతా మోతీమహలులోని హాలులో విచారంతో ప్రచారంచేస్తున్న ప్రభువుల చెవిలో పడుతూనే ఉంది.

ఆయనకు పెద్ద ఆందోళన కలిగింది.

సమయం మించి పోతున్నది!

ఇంతవరకూ - మాట యిచ్చిన రామమూర్తి ఎలాటి ఏర్పాటు చేసినదీ తెలియదు. ఒక వేళ భయపడి ఉపేక్షించాడేమో! ఈ సంగతి మొదటనే తెలిస్తే మరొక మార్గం ఆలోచించి వుండవచ్చునే!

*  *  *

ఆ ఊరేగింపు ఈశాన్యమూల వున్న బురుజును సమీపించింది. ఇంకా కొన్ని గజాలు దాటితే సింహద్వారం!

దానికి ముందు పతాక, తర్వాత, ఢంకా, నౌబత్తులూ, గుర్రాలమీద ప్రయాణిస్తున్నాయి. వెనుక భజంత్రీమేళాలూ అవీ వస్తున్నాయి.

ఆ బురుజు మలుపు తిరిగేసరికి విచిత్ర సంఘటన ఒకటి జరిగింది.

సింహద్వారం చేరుతున్న కొద్దీ ఆ ఊరేగింపుదారు లకు ఉత్సాహం మరీ ఎక్కువయింది. తమ శక్తికొద్దీ వారు వాద్యాలను ధ్వనింపజేయసాగారు. ఇలా మోగుతూవున్న ఢంకామీద హఠాత్తుగా దభాలుమని శబ్దంచేస్తూ, ఒక పెద్దరాయి పడింది. ఆ దెబ్బతో అది పగిలి శబ్దం చెయ్య కుండా చప్పున ఊరుకుంది. దాన్ని మోస్తూ వున్న గుర్రం బెదిరి ముందువాళ్లనూ, వెనుకవాళ్లనూ, కాళ్ళతో తన్ని, పడవేసి, ఏభై గజాల దూరం పారిపోయి నిలిచింది.

అందరిదృష్టి ఒక్కసారి ఆకాశంవైపు ప్రసరించింది. చక్కగా తిరుమణి, తిరుచూర్ణాలు ధరించి, రెక్కలు కట్టు కుని గరుడాళ్వారువలె వున్న ఒక వ్యక్తి తన పని నెరవేర్చి తృప్తిపొందినట్లుగా, భుజశక్తి యావత్తూ ఉపయోగించి, రెక్కలను ఆడిస్తూ వలయాకారంగా తిరిగి, కోటబురుజు మీదికి పోవడం అందరికీ స్పష్టంగా కనబడింది.

అంతతో తిరువీధి ఆగిపోయింది.

ఇంకా ముందుకు వెళ్లితే ఏమి ప్రమాదం జరుగు తుందో అనే భీతాహం ప్రతిపక్షుల గుండెలను సంచలింప చేసింది!

నగరప్రజలు హర్ష ధ్వానాలతో "రామ్మూర్తి! రామ్మూర్తే ఎగిరి, వచ్చి, తగిన ప్రాయశ్చిత్తం జరిగిం చాడు" అని కోలాహలం చేశారు.

మోతీమహలు హాలులో పచారు చేస్తూ వున్న ప్రభు

వులదగ్గరకు పరుగెత్తుకుంటూ ఒక సేవకుడు పోయి యీ సంఘటనను మనవి చేశాడు.

ప్రభువులు సంతోషంతోపాటు కలతపడుతూ, జెండా బురుజుమీదికి తొందరగా వచ్చి చాలా అలసిపోయి, విశ్రాంతి తీసుకుంటూ వున్న రామమూర్తిని చూశారు.

అతడు ప్రభువులను చూసి లేవబోయాడు. కాని ఆయన అతన్ని లేవనివ్వలేదు.

"రామ్మూర్తీ! నీ వేషం సాక్షాత్తూ గరుడాళ్వారి వలే వున్నదోయ్! నిజంగా నువ్వు గరుడాళ్వారనే భావించి, వాళ్లు హడలి వుండాలి. ఎంత సాహసం చేశావు! దీని వల్ల నీ ప్రాణాలకు అపాయమని గ్రహింపలేక పోయావా?"

"ప్రభూ! ప్రభుసేవలో ప్రాణాలు పోయినా నాకు విచారం లేదు. తలచుకొన్న ఘనకార్యం చెయ్యడంకన్న మానవుడికి జీవితం ముఖ్యం కాదని నా అభిప్రాయం!" అన్నాడు రామమూర్తి.

ప్రభువు లాతని ధైర్య, సాహసాలకూ, ఘనకార్యానికీ మెచ్చుకుని "జోగిరాజుపేట" అనే అగ్రహారాన్ని బహూకరించారట! మొన్న మొన్నటివరకూ, ఆ గ్రామం ఆ వంశీయుల హక్కు, భుక్తులతో వుంటూ వుండేది!

ఇది పెద్దలవల్ల విన్న సంగతి!

---

# 7. పరీక్ష

ఒకప్పుడు అభినవాంధ్రభోజుడు ఆనంద గజపతి మహారాజు లుంగారు పండిత గోష్ఠిలో వుండగా, 'శాస్త్రాలు చదివి పాండిత్యం సంపాదించడం గొప్పదా? కవిత్వం చెప్పడం గొప్పదా?' అనే విషయాన్ని గురించి పెద్ద చర్చ జరిగింది. సభలో గొప్ప పండితులూ ఉన్నారు; కవులూ ఉన్నారు; ఆ రెండింటా గట్టివారూ ఉన్నారు.

ఎవరికి తోచిన అభిప్రాయాలు వారు వెల్లడించారు. కొల్లూరు కామశాస్త్రులుగారు మాత్రం తమ అభిప్రాయాన్ని వెల్లడించ లేదు.

ఆయన గొప్ప పండితులు. ఆయనమాటమీద మహారాజులుంగారికి గురి యెక్కువ. ఆయన అభిప్రాయం ఏమిటో తెలుసుకుందామని ప్రభువులు ఆయనవైపు దృష్టి మరల్చారు.

కామశాస్త్రిగారు సమాధానం చెప్పక తప్పింది కాదు. తన అభిప్రాయం ఫలానా అని చెప్పకుండా ఒక సంఘటనను ఆయన జ్ఞప్తికి తెస్తూ ఇలా అన్నారు.

"ఈ విషయంలో – వెనకటి సంఘటనను ఒకదానిని జ్ఞప్తికి తెస్తాను. వెనుక చంద్రగిరి ప్రభువు వెంకటపతి రాయలవారు తమ ఆస్థాన విద్వాంసులు అప్పయ్య దీక్షితులుగారితోనూ, ఆస్థానకవి చెల్వపిళ్ళగారితోనూ కలిసి

ఒకనాడు సాయంత్రం దేవాలయానికి వెళ్ళారట! దేవాల యంలో గర్భగుడి, మండపాలకు ప్రదక్షిణం చేస్తూ ఈ ప్రదక్షిణం పూర్తి అయేసరికి మీ రిద్దరూ భగవంతుని గురించి ఒక శ్లోకం రచించి వుంచాలి. ఆ శ్లోకాలతో ఈ రోజు భగవంతుడిని స్తుతించి, పూజ చెయ్యదలచాము'' అన్నారు. ప్రదక్షిణం పూర్తిచేసి వచ్చేసరికి పిళ్ళగారు శ్లోకం తయారు చేసి, ప్రభువులకు వినిపించారు. దీక్షితులుగారు మాత్రం శ్లోకం కట్టలేదు. ప్రభువు దీక్షితులుగారిని దాన్నిగురించి ప్రశ్నింపగా, ఆయన మరేమీ సమాధానం చెప్పక, ''పిళ్లః కవి రహం విద్వాన్'' అని మాత్రం అన్నారట! దీన్నిబట్టి కవికీ, పండితునకూ వున్న తేడాను గ్రహించి రాయలవారు తాను దీక్షితులవారిని శ్లోకం రచించవలెనని కోరడమే తప్పని తెలుసుకుని క్షమాపణ వేడారట.

ఇలా చెప్పి శాస్త్రిగారు ఊరుకోగా, ప్రభువులు ''మీరు సెలవిచ్చినది బాగా వుంది. మాకూ కవిత్వం కంటె పాండిత్యమే ఘనమైనదని తోస్తున్నాది. అయినా క్రమక్రమంగా పాండిత్యానికి గౌరవం తగ్గిపోతున్నాది. కవిత్వానికి ప్రచారం ఎక్కువౌతున్నాది. నాలుగు అవ్వాకులూ, చెవ్వాకులూ కూసి, వ్రాసేవాళ్ళంతా కవు లయి పోతున్నారు. మనం శాస్త్రవిజ్ఞానాభివృద్ధికోసం తగిన పరిశ్రమ చెయ్యనలసి ఉన్నది. దీనికి అనువైన మార్గం ఏదో ఆలోచించండి'' అని అన్నారు. పండితులంతా ఆలోచనలో

పడ్డారు.

కామ : మనం శాస్త్రిల్లో పరీక్షలు ఏర్పాటుచేస్తే బాగా వుంటుందనుకుంటాను. పరీక్షలలో ఉత్తమంగా నెగ్గిన వారికి ఏదైనా బహుమానం ఏర్పాటుచేస్తే చాలా మంది పరీక్షను వస్తారనీ, ఈ విధంగా శాస్త్రిలు పాఠప్రవచనాల్లో ఉంటాయనీ చెప్పవచ్చు.

ఆనంద : శాస్త్రిలుగారు చెప్పినది బాగానే ఉంది. శాస్త్రిల్లో పరీక్షలంటూ పెడితే, వాటిలో మనమే మన ప్రాంతంలో మొదటివారం కాగలము. బాగా పరీక్ష ఇచ్చినవారికి బహుమానం యివ్వడమనేది ఒక ఘనకార్యం కాదు. అయినా ప్రథమంలో అందరిలోనూ ఉత్తమంగా నెగ్గిన ఒక వ్యక్తికే బహుమానం యివ్వడం మంచిది. బహుమానాల సంఖ్య హెచ్చయినకొద్దీ శ్రద్ధ తగ్గిపోతుంది. అయితే, ఎలాటి పరీక్ష శాస్త్రిలుగారికి నచ్చినట్లు? వ్రాత మూలకమా? మౌఖికమా?

కామ : వ్రాతపరీక్ష అయితేనే అందర్నీ సమానంగా పరీక్షించినట్లు అవుతుంది. ఆ వ్రాతవిషయంలో ఏమైనా అనుమానం వుంటే ఆ మీద ముఖపరీక్షను గురించి ఆలోచించవచ్చును.

ఆనం : సరే! ఆలాగే ఏర్పాటు చేయింతాము. మొదట్లో వ్యాకరణశాస్త్రంలోనే పరీక్షలు ఏర్పాటు చేద్దాము. పరీక్షలో అత్యుత్తమంగా నెగ్గిన అభ్యర్థికి మంచి

బహుమానం ముట్టజెప్పబడుతుంది. సాధారణంగా నెగ్గిన వారికి యోగ్యతా పత్రాలు ఇవ్వబడుతాయి. ఈ సంగతి అందరికీ తెలియజెప్పండి. పత్రికలోనూ ప్రకటిద్దాము.

అనుకున్న ప్రకారం పరీక్ష జరిగింది.

పరీక్ష కాలపరిమితి నాలుగు గంటలు. విషయం వ్యాకరణ శాస్త్రం; గ్రంథాలు - పరిభాషేందు - శబ్దేందు శేఖరాలు. పరీక్షకు రమారమి ఏభయిమంది హాజరయ్యారు ఇరవైయేళ్ళ యువకులు మొదలుకొని, అరవైయేళ్ళ వృద్ధుల దాకా బహుమానం ఆశించిన వ్యాకరణ పండితులు చాలా మంది పరీక్ష ఇచ్చారు.

ఆనందగజపతి ప్రభువు బహుమానం ఇచ్చేటట్లు చాటించినందున అది చాలా విలువైన బహుమానమై వుంటుందనీ, విలువ సంగతి యెలావున్నా - అలాంటి విద్వత్ప్రభునివల్ల బహుమానం పొందడమే ఒక ఘనత అనీ చాలా మంది అభిప్రాయం! అందువల్లనే కొమ్ములు తిరిగిన పండితులంతా పరీక్షకు సిద్ధపడ్డారు.

ప్రభువు ఆస్థాన పండితులలో కొందరికీ, సంస్కృత పాఠశాలలోని పండితులకీ కూడా పరీక్షలో పాల్గొనాలనే కుతూహలం లేకపోలేదు. అయినా వారిలోనే కొందరు పరీక్షాధికారులు కావడంవల్లా, పాఠశాలలోని అధ్యాపకులు పరీక్ష ఇవ్వడం ప్రతిష్ఠకు భంగం అని తోచడంవల్లా వారెవ్వరూ పరీక్షకు కూర్చోవ లేదు.

పరీక్షకు సమాధానాలు దేవనాగరి లిపిలోనే వ్రాయా లనే నియమం లేదు. తెలుగు లిపిలోనైనా వ్రాయవచ్చును. ఏమంటే - ఆంధ్రదేశంలో చాలామంది గట్టిపండితులున్నా, వారు గ్రంథాల నన్నిటినీ స్వయంగా వ్రాసుకుని అధ్యయనం చేసేవారు. వారికి దేవనాగరిలిపితో పరిచయం తక్కువ. అలాంటివారి సౌకర్యంకోసం ఈ యేర్పాటు చేయబడింది.

పరీక్షలు అయిపోయాయి.

సమాధానపత్రాలను దిద్ది గుణాలను నిర్ణయించి అభ్యర్థుల యోగ్యతలను నిర్ణయించడానికి ఆస్థానవిద్వాం సులు శ్రీ కొల్లూరు కామశాస్త్రిగారూ, మైసూరు భీమా చార్యులుగారూ నియమింపబడ్డారు. వారిద్దరూ అతి జాగ్ర త్తగా పరిశీలించి దిద్దారు.

కాని, ఒక చిక్కు వచ్చింది.

ఇద్దరు అభ్యర్థులకు ఒక్కమాదిరిగా గుణాలు - నూటికి తొంభైనాలుగు వచ్చినవి. ఉత్తముని నిర్ణయించ డానికి ఎలాగూ వీలులేకపోతున్నాదనీ, ఇద్దరిని నిర్ణయించ వలసి వస్తున్నాదనీ వారికి ఆందోళన కలిగినది.

వారిలో ఒక అభ్యర్థి యిరవై యేళ్ళ యువకుడు. అప్పుడే కాశీలో పదేళ్ళపాటు వ్యాకరణశాస్త్రం భాష్యాంతం అభ్యసించి వచ్చిన కుశాగ్రబుద్ధి. రెండో ఆయన ఏభై యేండ్ల నడివయస్సువాడు. ఆయన చాలా కాలంనుంచి మహారాజులుంగారిని ఆశ్రయించుకుని జీవిస్తూ గౌరవంగా

కాలక్షేపం చేస్తున్న విద్వాంసుడు. ఆశ్రితుడు గదా అని, మహారాజుగారికీ ఆయనమీద అభిమానం ఉంది.

మహారాజులుంగారి ఆశ్రితుడూ బాగా వ్రాయడం చేతా, రెండో వ్యక్తి ప్రవర్ధమానుడగు యువకుడు కావడం చేతా, అతడు విద్యాపూర్తి చేసుకుని కొత్తగా రావడం చేతా వయసుమీరిన ఆయనకే బహుమానం వచ్చేటట్లు చెయ్యాలని పరీక్షకులు తలచుకున్నా వీలయింది కాదు.

ముఖపరీక్ష చేసి, అందులో కొంత తేడా చూపించి, యువకుని రెండవవానినిగా చెయ్యాలని నిశ్చయించు కున్నారు పరీక్షకులు.

పరీక్షకుల ఆదేశాన్ని అనుసరించి అభ్యర్థి వారి యెదుట హాజరయ్యాడు. భీమాచార్యులుగారు ముఖపరీక్ష సాగించారు.

భీమ : అబ్బాయీ! మీ దేవూరు? మీ తండ్రిగా రెవరు?

యువ : మాది యీ వూరేనండీ, కొంసెల్ల బ్రహ్మాజీ గారు మా నాయనగారండీ!

భీమా : ఓహో! అలాగా! వారిని నేను బాగా ఎరు గుదును. నిన్నెప్పుడూ యీ వూళ్ళో చూసినట్లు లేదే?

యువ : నే నిన్నాళ్లూ కాశీలో గురుకులవాసం చేసి శ్రీ దండిభట్ల - విశ్వనాథశాస్త్రులవారివద్ద వ్యాకరణం పూర్తిచేసుకుని యీ మధ్యనే వచ్చానండి!

భీమా : చాలా సంతోషం! నీవు సంస్థానం హితైషు లగు బ్రహ్మశ్రీపండితుల పుత్రుడవు కావడమూ, అభినవపతంజలి దండిభట్ల విశ్వనాథశాస్త్రిగారి శిష్యుడవు కావడమూ ప్రశంసించతగినది. నువ్వు పత్రిక కూడా బాగుగా వ్రాసి, వంశప్రతిష్ఠనూ, గురువుగారి ప్రతిష్ఠనూ నిలవబెట్టావు. నూటికి తొంభై నాలుగు గుణాలు వచ్చాయి. కాని, ఆ తక్కిన చిన్న ప్రశ్న ఎందుకు విడిచిపెట్టావో తెలియదు.

యువ : ప్రశ్నపత్రం నాకు ఆలస్యంగా అందింది. సమాధానపత్రికలు వసూలు చేసినప్పుడు మొట్టమొదట నా పత్రికే తీసుకొనబడింది; అందువల్ల వ్రాయలేక పోయినా నండి.

భీమా : సరే; బాగానే ఉంది. కాని – నువ్వు ప్రశ్నలన్నిటికీ కాశీ సంప్రదాయం ప్రకారం సమాధానాలు వ్రాస్తూ, ఒక ప్రశ్నకు మాత్రం ఇక్కడి సంప్రదాయా న్ననుసరించి సమాధానం ఎందుకు వ్రాశావూ?

యువ : తక్కిన ప్రశ్నల విషయంలో కాశీపద్ధతికీ, యిక్కడి పద్ధతికీ అంతగా భేదం లేదు. అందువల్ల నాకు రావలసిన గుణాలు వాటికి రాగలవనే ధైర్యం వుంది. ఒక ప్రశ్నకు మాత్రం అభిప్రాయభేదం వుండడంవల్ల – కాశీపద్ధతిలో సమాధానం రాస్తే గుణాలు రావనే అధైర్యం కొద్దీ యిక్కడి సంప్రదాయాన్ని అనుసరించి సమాధానం వ్రాశాను.

ఇలా అంటూ ఆ యువకుడు కాశీ సంప్రదాయాన్ని అనుసరించి దాని కెలాటి సమాధానం వ్రాయవలసినదీ వివరంగా చెప్పి, సంతృప్తి కలిగించాడు. ఏ విధంగా చూచినా పరీక్షకులకు ఆ యువకునిలో లోపం కనిపెట్టడం సాధ్యం కాలేదు.

భీమా : నాయనా! నువ్వు చాలా బుద్ధిమంతుడవు. పెద్దల విషయంలో వినయవిధేయతలు కలవాడవు. ఒక్క విషయములో నీ సలహా తీసుకుందామని నిన్ను పిలిపించాము. నువ్వు బాగా ఆలోచించుకుని మరీ నీ అభిప్రాయం చెప్పు.

యువ : చిత్తం, చిత్తం.

భీమా : ఈ పరీక్షలో యిద్దరికి నూటికీ తొంభై నాలుగు గుణాలు వచ్చాయి ; అందులో నువ్వొకడవూ, రెండో ఆయన వయసు మీరిన రామశాస్త్రిలుగారు ; ఆయన చాలా కాలంనుంచీ మహారాజులుంగారిని ఆశ్రయించుకుని వున్నవారు. మీ యిద్దరిలో ఎక్కువ తక్కువలు నిర్ణయించడం సాధ్యం కాలేదు. బహుమతి మాత్రం ఒక్కరికే యివ్వాలనీ, ఒక్కరినే ఉత్తమునిగా నిర్ణయించాలనీ ప్రభువుల ఆజ్ఞ ; ఈ పరిస్థితి అంతా మాకు అయోమయంగా ఉన్నది. నీ సలహా ఏమిటో తెలుపగోరుతున్నాం.

యువ : (నవ్వుతూ) అయితే, నా దస్తూరి బాగు లేదనో, రచన సరిగా లేదనో కొన్ని గుణాలు పరీక్షకులు తగ్గించవచ్చును.

భీమా : అది న్యాయ విరుద్ధం! పరీక్షకులు ఇన్ని నిర్ణయాలు చెయ్యకూడదు.

యువ : అయితే మీ యిష్టం! నా యిష్టం ప్రకార బహుమానం నిర్ణయించేమని చెప్పండి.

భీమా : అది పక్షపాతం అనిపించుకోదూ? నువ్వు దేనినయినా సకారణంగా చెప్తావని అనుకుంటూ వుంటే - మమ్మల్ని తికమకలు పెడుతూవున్నావు కదూ!

యువ : ఎంత మాట! పెద్దలను ధిక్కరించడం మహాపరాధం! అది నా జన్మలో జరగదు. మనుష్యుల యోగ్యతను నిర్ణయించడానికి ఒక్క విద్యే కొలబద్ద కాదు. విదేశవాసంవల్ల నాకూ అనుభవానికి వచ్చింది. నాకు వయస్సు తక్కువ. బహుమానం రాకపోయినా ఉత్సాహం తగ్గదు. విద్యతోపాటు వయస్సుకు కూడా గౌరవం యివ్వడం మన భారతీయ సంప్రదాయం; నాకు బహుమానం ముఖ్యం కాదు. యోగ్యతాపత్రం యిచ్చినా చాలును. విజయనగర సంస్థానంలో నెగ్గినవాడని పేరు పడితే ఎక్కడయినా జీవనోపాధి లభించగలదు. అందుకోసమే పరీక్షకు వచ్చాను. మొదటివాడుగా ఆరితేరాలనే అత్యాశ నా కెన్నడూ లేదు.

భీమా : నాయనా! చిరంజీవ! నువ్వు మునుముందు గొప్ప అభివృద్ధికి రాగలవు. ఈ విషయమంతా మహారాజులుంగారికి మనవి చేస్తాము. తర్వాత వారు ఎలా నిర్ణయిస్తే అలా జరుగుతుంది.

పరీక్షకులు సమాచార మంతటినీ మహారాజులుం గారికి మనవి చేశారు. బహుమానం యిచ్చే విషయం గురించి కూడా చర్చ జరిగింది.

మొదట మహారాజుంగారు బహుమానం విషయంలో చర్చించాడు. సర్వోత్తమంగా నెగ్గినవారికి ఐదునూర్ల వరహాలు ఇవ్వడం తమ ఉద్దేశ మని మహారాజావారు తెలిపారు.

భీమా – మహాప్రభువులు ఎంత బహుమానం ఇచ్చినా కాదనము. కాని, యిలా చేస్తే గొప్ప చిక్కు వుంది. మనం అన్ని శాస్త్రాల్లోనూ పరీక్షలు పెట్టదలచుకున్నాము. వ్యాకరణానికి ఎక్కువమంది అభ్యర్థులు వస్తారు; గాని తర్క వేదాంత మీమాంసలలో చాలా తక్కువమంది వస్తారు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క అభ్యర్థి ఉండడమే తటస్థించ వచ్చు. అప్పుడు తగిన యోగ్యత లేకపోయినా, మనం బహుమానం ఇవ్వవలసి వస్తుంది. మరొక సంగతి, ఇద్దరు ముగ్గు రభ్యర్థులు సమానంగా గుణాలను సంపాదిస్తే, వాళ్లని ఎలా గౌరవించేది? అనే విషయం సమస్యగా పరిణమిస్తుంది. ప్రభువువారి ఆస్థాన విద్వాంసులకు పరీక్షకు కూర్చునే అవకాశం లేకపోవడమూ, తన్మూలంగా వారి మనస్సులు కొంత కలతపడడమూ సంభవించవచ్చును. బహుమానం విలువ కొంత తగ్గిస్తే బాగుంటుందని చెప్ప సాహసిస్తున్నాను. ఆ పైని ప్రభువుల చిత్తం.

ఆనం : ఉత్సాహం కలగడానికి బహుమానం ఆకర్ష కంగా వుంటే బాగుండునని అభిప్రాయపడ్డాము. మీ ఆలోచనే బాగుంది. నూటపదహార్లు విలువ సరిపోతుం దనుకుంటాము.

భీమా : చిత్తం. ప్రస్తుతం బహుమానం విషయంలో ఎలా చెయ్యవలసినదీ ప్రభువులు నిర్ణయించాలి.

ఆనం : ఇలాటి పరిస్థితులు ఎప్పుడో గాని సంభవింపవు. మేం బహుమానాన్ని ఒక్కరికే యివ్వాలని అనుకున్నా రెండో వ్యక్తికి యివ్వకూడదని అభిప్రాయపడడం లేదు. ఇలాటి సందర్భంలో అన్నివిధాలైన యోగ్యతలనూ గమ నించాలి. విద్యతో పాటు వయస్సుకు కూడా గౌరవం మన భారత దేశంలో ఉన్నది. అందువల్ల బహుమానం రామశాస్త్రిగారికే ముట్టచెప్పవలసి యున్నది. యువకు డైన రెండో ఆయనను మనం తగినట్లు గౌరవిద్దాం. పరీ క్షలో కృతార్థులైనవారందరికీ, యోగ్యతా పత్రికలను సిద్ధం చేయించి వుంచండి. సభలో శాలువులతో కూడా వారి నందరినీ గౌరవిద్దాం. సభ జరపడానికి ఏర్పాటు చేయిస్తాం. విద్వాంసు లందరికీ ఆహ్వానాలు పంపండి.

భీమా : చిత్తం. మహాప్రభువుల సెలవు ప్రకారం జరిగిస్తాం.

*　　　*　　　*

ఆషాఢ శుద్ధ పౌర్ణమినాడు మధ్యాహ్నం నాలుగు

గంటలకు రాజభవనంలో పండితసభ ఏర్పాటు చేయబడింది. సభకు విజయనగరాస్థాన విద్వాంసులూ, ప్రభువుల పోష్య వర్గంలోని పండిత కవులూ, పరీక్షకు వ్రాసినవారూ, కొందరు ఊరిపెద్దలూ వచ్చారు.

ఆనందగజపతి ప్రభువు ఉన్నతమైన ఆసనంమీద కూర్చుని వుండగా దివాను కోదండరావు పంతులుగారు యిలా విన్నవించారు.

"విద్వద్వతంసులారా! ప్రభువుల ఆజ్ఞ ననుసరించి మీ అందరికీ స్వాగతం యిస్తున్నాను. గతవారం జరిగిన విద్వత్పరీక్షల ఫలితాలు తెలుసుకోవడంకోసం మీ రందరూ చాలా కుతూహలంతో ఉన్నారు. నా ప్రసంగంతో విసుగెత్తించక ఆ విషయాన్నే మొదట మనవి చేస్తాను. పరీక్షకు యాభై మందికి పైగా అభ్యర్థులు వచ్చారు. అందులో నలభై మందికి పైగా కృతార్థు లైనందుకు మహారాజులుంగారు చాలా సంతోషిస్తూ ఉన్నారు. కృతార్థు లందరికీ యోగ్యతాపత్రికలూ, కాశ్మీరశాలువలూ బహూకరింపబడగలవు."

ఈ మాట వినేసరికి అందరూ హర్షంతో కరతాళ ధ్వనులను చేయసాగినారు.

"సర్వోత్తముని నిర్ణయించడంలో ఒక చిక్కు వచ్చినది. ఇద్దరు అభ్యర్థులు ఒక్కమాదిరిగానే గుణాలు తెచ్చుకున్నారు. అందులో ఒకరు చాలా కాలంనుంచీ సంస్థా

నాన్ని కనిపెట్టుకుని వున్న రామశాస్త్రిలుగారు. రెండో ఆయన చాలా చిన్నవాడు; ఇరవైయేళ్ళ యువకుడు. కాశీలో వ్యాకరణశాస్త్రం పూర్తిచేసుకుని యీ మధ్యనే వచ్చాడు, సంస్థానాలను ఉద్ధరించి మనకు ఆ ప్రవర్గంలో చేరి, పేరు ప్రతిష్ఠలు పొందిన కొంపెల్ల లక్ష్మిసోదెమ్మగారి వంశంలోనివాడు. బ్రహ్మజీపండితుల సుపుత్రుడు. ముందు ముందు వృద్ధిలోకి రావలసిన యీ యువకునికి మా శుభాశీస్సులు.''

ఇలా పలుకగా సభ్యులంతా కరతాళ ధ్వనులు చేశారు. తర్వాత కోదండరావు పంతులుగారిలా అన్నారు :

''విద్యచేతను వీరిద్దరూ సమానులే, అయినా, వయస్సునుబట్టి కూడా ఆలోచిస్తే రామశాస్త్రిలుగారు గౌరవార్హులని అందరూ ఒప్పుకోనవలసినదే! కావున, మహారాజులుంగారు నూట పదహార్లు విలువ గల యీ బంగారు పతకాన్ని, యోగ్యతా పత్రాన్నీ ఆయనకు బహుమానం యిస్తున్నారు.'' అని చెప్పగా, రామశాస్త్రిగారు లేచి వెళ్లి మహారాజులుంగారివల్ల వాటిని పొంది ప్రత్యభివాదనం చేశారు.

''ఇక - అన్నివిధాలా ఆయనతో సమానులుగా గెలుపొందిన బ్రహ్మజీపండితుల పుత్రులు విశ్వనాథ శాస్త్రిగారికి నూట పదహార్ల విలువ గల యీ రజతపాత్రం బహుమానంగా - యోగ్యతా పత్రికతో పాటు ఇవ్వబడుతుంది.

మొదట్లో ఒక్కరికే బహుమానం యివ్వడానికి నిర్ణయింప బడినందుననూ, ఆ బహుమానం యిద్దరికి యిచ్చే పక్షంలో కొంచెం వ్యత్యాసం చూపడం ధర్మం అయినందువల్లనూ విలువ సమానమే అయినా, స్వరూపంలో మాత్రం భేదం చూపబడింది. దీన్ని అందరూ ఆమోదిస్తారనే మహారాజులుం గారి తలపు.''

ఇలా చెప్పగా విశ్వనాథశాస్త్రిగారు వెళ్ళి తమ బహుమానాన్ని. పట్టాన్ని గ్రహించి, గద్దెకు నమస్కరించి వెనక్కి వచ్చారు. తర్వాత విద్వాంసులందరికీ కాశ్మీరశాలువలు ఇయ్యబడ్డాయి.

తర్వాత దివాను లేచి "మహారాజులుంగారు శ్రీ విశ్వనాథశాస్త్రులుగారిని తమ సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా నియమించినట్లు తెలుపమన్నారు." అని చెప్పేసరికి మళ్ళా అందరూ హర్షంతో కరతాళధ్వనులు చేశారు.



---

# 8. పరిచయం కోసం

ఇప్పుడు ప్రభుత్వం ప్రజలది; గాని మొన్న మొన్నటివరకూ ప్రభుత్వం ప్రభువుల చేతుల్లోనే వుండినది. గడచిన శతాబ్దంలో సంగతి యిక వేరుగా చెప్పనక్కరే లేదు.

ఇప్పుడు రాష్ట్రానికి ప్రధానాధికారి అయిన గవర్నరు రాష్ట్రం నలుమూలలా తిరుగుతూ వుండడం, ప్రజలకు సలహాలు యివ్వడం, క్రొత్తవాటికి పునాదులు వెయ్యడం, తయారయిన వాటికి ప్రారంభోత్సవాలు జరపడం పరిపాటి అయినది. ప్రసిద్ధమైన పట్నాలకే కాకుండా మారుమూలల వున్న పల్లెలకు కూడా వెళ్ళడానికి గవర్నరు ఏమాత్రమూ సంకోచించడం లేదు.

అప్పట్లో జిల్లా కలెక్టరు ఏదైనా వూరికి రావడం అంటే మహా అట్టహాసంగా వుండేది. కలెక్టరు వస్తాడనగా వారంరోజుల ముందునుంచే కావలసిన యేర్పాట్లన్నీ మహా ఘనంగా జరిగేవి! కలెక్టరు వచ్చి తిరిగి వెళ్ళిపొయ్యేదాకా గ్రామాధికారులకు వూపిరి సలిపేది కాదు; గుండెలు బితుకు బితుకు మంటూనే వుండేవి.

అప్పుడు జిల్లాబోర్డుల అధికారాలు పూర్తిగా కలెక్టరుకే దఖలుపడి వుండడంవల్ల - కలెక్టరు వచ్చి క్యాంపుచేసే వూళ్ళకు మంచి సౌకర్యాలు కలిగేవి. అంటే వారి కారు నిరాఘాటంగా వూర్లు చేరుకోడానికి - రహదారులు లేని

వూళ్ళకు రహదారులు ఏర్పడేవి; రహదారులు వున్న వూళ్ళకు అవి కొత్త రోడ్లవలె మరమ్మత్తు చేయబడేవి.

*     *     *     *

ఇక గవర్నరు సంగతి చెప్పనక్కరే లేదు.

ఆయన సాధారణంగా రాజధానిని విడిచి ఎక్కడకూ రావడమే వుండదు.

రాష్ట్ర - గవర్నరు తక్కిన కాలం అంతా మద్రాసులోనే వుండి - వేసవిలో మాత్రం నీలగిరికి వెళ్లుతూ వుండడం అలవాటు. తక్కిన వూళ్ళకు వెళ్ళడమనేదే వుండదు. శంకుస్థాపనలకూ, భవనాలు మొదలైనవి తెరవడానికీ, ఆ యా శాఖల్లోని వుద్యోగస్థులే బాధ్యత వహించేవారు. ఎవరో ఒకరు కార్యం జరిపించేవారు. దానికి యింత ఆర్భాటమూ వుండేది కాదు.

తప్పనిసరి అయితే - ఎవరైనా మహారాజులు మహా నిర్బంధంచేస్తే - ఆ మహారాజులు చేసే సమ్మానం అందుకోవడంకోసం తమ పాలన కాలంలో ఒకటి, రెండు సార్లు గవర్నరు యితర పట్నాలకు వెళ్ళడం జరిగేది.

గవర్నరు ఎక్కడికి వెళ్ళకపోవడానికి ఆయన నిర్వహించవలసిన కార్యభారమే కాకుండా మరికొన్ని కారణాలూ వున్నాయి.

గవర్నరు బయలుదేరాలంటే ఒక ఊరు బయలుదేరవలసినంత తతంగం వున్నది. ఆయనతోపాటు కుటుంబమూ,

నౌకర్లూ, చాకర్లూ, వుద్యోగస్తులూ - వీరందరికీ ఒక ప్రత్యేకపు రైలుబండి కావాలి. వీరి బసలకు ఎన్నో భవనాలు కావాలి! ఇంత పరివారంతో మాటిమాటికీ బయలుదేరాలంటే సులభమైన పని కాదు.

ఆ కాలంలో గవర్నరు, వైస్రాయివంటి ప్రభువులు యెక్కడికి బయలుదేరినా, తగిన బందోబస్తుతో వెళ్ళాలి. రైలు ఆగే స్టేషనులలో గవర్నరుగారు ప్రయాణం చేసే సెలూనుకు యిటూ అటూ ఫర్లాంగుదూరంలో ఎవ్వరూ వుండకూడదు. బసచేసిన చోట కూడా అలాగే; అందుకు తగినట్టుగా రిజర్వ్ పోలీసు కాపలా! ఇలాటి కాపలాలు లేకపోతే ప్రభుద్రోహుల మూలంగా ఏమైనా ప్రమాదం సంభవించవచ్చునని అధికారుల అనుమానం.

అందువల్ల - గవర్నరువంటి రాజప్రతినిధులు ఏ నగరానికైనా వెళ్ళడమనేది జరిగితే - ఆ వూరు ఎంతో అదృష్టం చేసుకున్నదనీ, అక్కడివారు ఎంతో చరితార్థులనీ తలచబడేది.

విజయనగరం మహారాజులుంగారు - శ్రీ ఆనంద గజపతి ప్రభువు ఒకసారి చెన్నపట్నం వచ్చినప్పుడు గవర్నరు వెన్‌లక్ ప్రభువును దర్శించి, ఆయన పరిచయం చేసుకున్నారు. ఒకసారి విజయనగరం వచ్చి తమ కోటనూ, తమ రాజధానినీ పావనం చెయ్యాలని కోరినారు. గవర్నరు వెన్‌లక్ ప్రభువు మారుమాట చెప్పడానికి అవకాశం లేక

"సరే!" అని అంగీకరించడమూ జరిగింది!

మహారాజులుంగారు తమ రాజధానికి వచ్చి ఆ సంగతి ఎంతో సంతోషంతో తమవారి కందరికీ తెలియజేశారు.

ఇక నేముందీ? గవర్నరుకు ఘనంగా స్వాగతం యివ్వడానికి రాత్రింబగళ్లు బ్రహ్మాండంగా ప్రయత్నాలు జరిగాయి.

ప్రధానమయిన వీధులన్నీ చక్కగా అలంకరింప బడుతున్నవి. అక్కడక్కడ శిల్ప చాతుర్యాన్ని వెల్లడిచేస్తూ, స్వాగత తోరణాలు నిల్పబడుతున్నవి. పనివున్నా, లేకపోయినా ఉద్యోగస్థు లందరూ ఇటూ అటూ రాకపోకలు సాగిస్తున్నారు.

మహారాజులుంగారు నగరాలంకరణమూ, బసల యేర్పాట్లూ, భోజన వసతులూ, స్వాగత మహోత్సవం మొదలైనవాటికి వేర్వేరుగా ఉద్యోగస్థులను నియమించారు. తాము స్వాగతపత్రం యెలాగు తయారుచెయ్యవలసినదీ, గవర్నరుగారికి ఎవరెవరి పరిచయం కలుగజేయవలసినదీ ఆలోచించుకోసాగిరి. గొప్ప విద్యావేత్తలూ, సంఘోద్ధారకులూ అయిన పురప్రముఖులను పరిచయం చేద్దామని ప్రభువుల సంకల్పం. అందుకోసమని ఆయన స్వయంగా ఒక పేర్ల పట్టీని తయారుచేసి, చదివింప పూనుకొన్నారు. ఆ విధంగా ఆలోచన చేసి చూస్తే వేళ్ళమీద లెక్కింప తగినవారు మాత్రమే మిగిలారు.

కానైతే గవర్నరుప్రభువు తన ప్రార్థనను తోసి

రాజనక, అభిమానంకొద్దీ రావడానికి అంగీకరించినంత మాత్రాన - స్వాతంత్ర్యం అవలంబించి, తాను అందర్నీ విచక్షణ లేకుండా పరిచయంచేస్తే ఆయన ఏమనుకుంటారు? ఒక వేళ గవర్నరు అనిష్టాన్ని సూచిస్తే అంతకంటే తనకు అవమానం యింకేమి వుంటుందీ?

ఇలాగు నిర్ణీతమైన పద్దులో ముఖ్యులమని అనుకొంటున్న తగుమనుష్యుల పేర్లే చేరలేదు. రాజబంధువుల్లో ప్రధానులైనవారు కూడా పద్దుకు ఎక్కలేదు.

అలాంటివాళ్ళకు చాలా నిరుత్సాహం కలిగింది. ప్రభువులు కొందరికి గవర్నరుగారి కియ్యబడే విందులో పాల్గొనడానికి అవకాశం యిచ్చి వారికి వున్న అసంతృప్తిని తొలగించారు.

విజయనగరంలో వున్న సంపన్న వైశ్యకుటుంబాలలో పేర్లవారి కుటుంబం పేరు పడినది. రామమూర్తిసెట్టిగారు ఆ కుటుంబం పేరు ప్రతిష్ఠలను వృద్ధిపొందించారు.

ఆయన కొన్ని లక్షలకు అధికారి; చుట్టుపట్ల ఎక్కడా మిల్లులులేని - సమయంలో మిల్లుల పేరుకూడా సామాన్యులకు తెలియని కాలంలో ధాన్యం మిల్లులూ, వేరుసెనగ మిల్లులూ స్థాపించి కొన్ని వందల జనానికి ఆధారం కల్పించిన ప్రజాహితజీవి! సత్రాలు స్థాపించి నిరతాన్నదానం సాగించిన ధర్మమూర్తి! విద్వాంసులనూ, యాచకులనూ సత్కరించిన వదాన్యుడు! ఆర్జనలో దమ్మిడీలనుంచీ లెక్క

వేసి, త్యాగంలో రూపాయిలను దమ్మిడీలవలె విరజల్లిన ఉదారుడు. ప్రసిద్ధిపొందిన పురప్రముఖుల్లో అగ్రేసరుడు. విశేషించి మహారాజులుంగారికి అభిమాన పాత్రుడు!

అయితేనేం? రామమూర్తి సెట్టిగారి పేరు మహారాజులుంగారి పద్దుకు ఎక్కలేదు.

ఎలా ఎక్కుతుంది?

పద్దులో పేరు పడడానికి వ్యక్తిగతాభిమానంగాని, సంపదగాని, దాన ధర్మాలుగాని అర్హతలు గావు. గొప్ప విద్యావేత్త అయినా కావాలి; ప్రసిద్ధుడైన సంఘసంస్కర్త అయినా కావాలి; సాటిలేని ప్రజాసేవకుడైనా కావాలి.

తనపేరు పద్దులో పడనందుకు ఆయన చాలా కించపడ్డాడు. ఎలాగయినా - గవర్నరు గారి పరిచయం సంపాదించి, ఆయన కరచాలన భాగ్యం పొందాలనే అభిలాష రామమూర్తిసెట్టిగారికి ఎక్కువైనది.

తన పేరు పద్దులో పడలేదని తెలిసిన వెంటనే ఆయన తన హితైషులూ, విద్యావేత్తలూ గురువులూ అయిన రామావతారంగారి ఇంటికి సలహాకోసం గబగబా వెళ్ళాడు. రామావతారంగారు సాధారణ వ్యక్తి కాదు. అసాధారణ మేధావులు. అసలు ఆయన పేరు రామావతారంగారు కానే కాదు. రామానుజాచార్యులుగారనేదే ఆయనపేరు. కాని ఆయన ధర్మ పరాయణత వల్లనూ, ప్రతిభవల్లనూ, పౌరులకు ఆయనయందు గల భక్తి విశ్వాసాలవల్లనూ

'రామావతారం' అనే పేరు ప్రసిద్ధమైనది. ఆయనయెడల మహారాజులుంగారికి గొప్ప గౌరవం.

సెట్టిగారు తనవద్దకు యెందుకు వచ్చినదీ - ఆయన వెంటనే గ్రహించారు. ఆయన కోరికలోని సాధకబాధకాలను వివరించి చెప్పి, ఊరడించదలచారు. కాని సెట్టిగారి పట్టుదల ముందు తన మాటలు యేమీ పనిచేసేటట్టు ఆయనకు తోచలేదు.

రామావతారంగారు క్షణం ఆలోచించారు. ఏదో విషయం చటుక్కున స్ఫురించినది.

'అయితే సరే లెండి! రేపు వుదయం రండి. ఇద్దరమూ ప్రభువువారికి మనవి చేసుకుందాము' అన్నారు.

ఆమాటతో సెట్టిగారికి నిరాశ ఎక్కువయింది. వీలుంటే ప్రభువులు తన పేరు పద్దులో చేర్చేవారే! ఇక అలాంటప్పుడు వారిని దర్శించి మాత్రం ఏమి ప్రయోజనం? ప్రభువుల అభిప్రాయం మార్చడం ఎవ్వరితరం? అయినా గురువుల మాటప్రకారం జరిగించాలనే అనుకొని 'తమరు ఏదో మార్గం యోచించాలి. అవసరమయితే యీ విషయంలో ఎంత డబ్బు ఖర్చు పెట్టడానికయినా సిద్ధంగా వున్నాను' అని ఆయన అన్నారు.

రామావతారంగారు మరేమీ బదులు చెప్పడంలేదు.

మర్నాడు ఉదయం రామావతారంగారూ, రామమూర్తి సెట్టిగారూ ప్రభువుల దర్శనానికి వెళ్ళారు.

ప్రభుదర్శనం సులభంగానే లభించింది.

మహారాజులుంగారు సెట్టిగారిని చూస్తూ 'ఏమి రామ మూర్తీ! యిలా వచ్చావు?' అని ప్రశ్నించారు.

చిత్తం మహాప్రభూ! గవర్నరుగారి దర్శనానికి...'

"పరిచయం అను; దర్శనమేమిటి? ఆయన కారు లోనో - బగ్గీలోనో వెళ్ళుతూవుంటే వూరందరూ దర్శించు కోవచ్చును గదూ :'

"చిత్తం చిత్తం. అదేనండి! ప్రభువులకు మనవి చేదామని...'

"ఓహో! మాకు శిఫారసు చెయ్యడానికి గాబోలు, శ్రమపెట్టి గురువుగారిని తీసుకు వచ్చావు!" అన్నారు మహా రాజాలుంగారు నవ్వుతూ.

"గురువుగారే ప్రభువుల దర్శనానికి రావాలని చెప్పగా వచ్చానండి! ఇంతకూ ప్రభువుల దర్శనం చేసు కోవడంకంటె మావంటివాళ్ళకు కావలసిన దేమున్నది?

"సరేలే! మీ గురువుగారికి వర్తమానం పంపాలని మేము ఇప్పుడే అనుకుంటున్నాం. యింతలో వారే దయ చేశారు. మంచిదే అయినది. వారూ, మేమూ కలిసి ఆలోచిస్తాం లే; నీవు వెళ్ళవచ్చును" అన్నారు ప్రభువులు.

రామమూర్తిసెట్టిగారు శెలవు తీసుకొని వెళ్ళినారు; తన కోరిక నెరవేరగలదనే ధైర్యం అతనికి యిప్పుడు కలి గింది.

తర్వాత జరగవలసిన యేర్పాట్లనుగురించి మహా రాజులుంగారూ, రామావతారంగారూ ఆలోచనలుచేసి, ఒక పథకాన్ని ఏర్పాటు చేశారు.

తర్వాత ప్రభువులే అందుకున్నారు—

"మరి రామమూర్తి సంగతి యేమిటి?"

"నాకూ ఏమీ తోచలేదు ; అందుకోసమే ప్రభువుల దర్శనానకి తీసుకొని వచ్చాను. పోనీ సంఘసేవకన్నా పాటు పడుతున్నాడని చెప్పడానికి అవకాశం కనిపించడంలేదు" అని అన్నారు రామావతారంగారు.

"ఇంకా వారం రోజులు పైమున్నది. ఈ వ్యవధిలో అతను ప్రజాహితసంస్థను దేనినైనా నెలకొల్పేటట్టు చూడండి. దానికి గవర్నరుగారి పేరుపెట్టి - వారిచేతనే తెరపించవచ్చును!"

"ప్రభువుల ఆలోచన చాలా అద్భుతంగా ఉన్నది. ఈ విషయంలో ఎంతయినా ఖర్చు చెయ్యడానికి సెట్టిగారు సిద్ధంగా వున్నారు. దీనివల్ల అతని కోరిక నెరవేరడమే కాకుండా పేరూ శాశ్వతంగా నిలబడుతుంది."

"కాని ఒక్కసంగతి! ఈ పని రహస్యంగా జరగాలి. ఎవరు, ఎందుకోసం నెలకొల్పుతున్నారో యెవ్వరికీ తెలియ కూడదు. తెలిస్తే - పోటీకి మరికొందరు యీపద్ధతిని అవ లంబిస్తారు. దానివల్ల రసాభాస అవుతుంది. రామమూర్తి స్వయంగా యీ పనిలో దిగకూడదు. మీరే బాధ్యత

వహించి జరిపించడం మరీ మేలు.''

"చిత్తం, చిత్తం. ప్రభువుల ఆజ్ఞకు బద్ధుణ్ణి" అంటూ రామావతారంగారు ప్రభువులవద్ద శెలవు తీసుకుని వెళ్లారు.

వెంటనే ఆయన రామమూర్తి సెట్టిగారిని కలుసుకొని ఏమి చేయవలసినదీ నిర్ణయించారు.

ఈ స్వల్పకాలంలోనూ శ్రీ రామావతారంగారి పర్యవేక్షణకింద - విజయగరం పార్కు చెరువుకు పడమటివైపున విశాలంగా వున్న ఖాళీ స్థలంలో చిన్నదైనా - ఒక అందమైన భవనం తయారైనది.

దానికి నాలుగువైపులా వుండే ప్రదేశం చాలా అందంగా తయారు చెయ్యబడింది. ముందువైపున చక్కని రోడ్డు - దానికి రెండు వైపులా దారిపొడుగునా రకరకాల పూలమొక్కలతో వున్న మట్టిగోలెములు నిలప పడ్డాయి. అది యెవరు నిర్మించినదీ, ఎందుకు అంత శీఘ్రంగా నిర్మించినదీ, ఎందుకోసం నిర్మించినదీ యెవ్వరికీ తెలియదు. ఆ పని జరుగుతున్నప్పుడు రామావతారంగారు రెండు మూడు సార్లు రావడంచేత ఆయనకు ఈ సంగతి తెలిసి వుండాలని అనుకున్నా, ఆయనను అడిగే ధైర్యం ఎవ్వరికీ లేదు. ఆయన యెదుట నిలవడానికే భయం చాలా మందికి.

* * * *

గవర్నరు వెన్‌లక్ ప్రభువు తన సిబ్బందితో కూడా ఒక ప్రత్యేకపు రైలుబండిమీద విజయనగరానికి విజయం

చేశారు. ఆయనను చూడడానికి చుట్టుప్రక్కల గ్రామాల నుంచి కూడా జాతరకు వచ్చినట్లు జనం తండోపతండంగా వచ్చారు. గవర్నరుగారి వూరేగింపునకు నిర్ణయింపబడిన రోడ్డులకు రెండు ప్రక్కలా దడి కట్టినట్లు వాళ్లు క్రిక్కిరిసి నిలిచి, ఆయన కోచిలో వెళ్లుతూవుండగా, దేవతామూర్తి అనే భావంతో నమస్కారాలు పెట్టారు. ఆయన చిరునవ్వుతో వాటిని అందుకుంటూ ఆ ఘనస్వాగతానికి ఎక్కువగా సంతోషించారు.

ఊరేగింపు అయిన తరువాత గవర్నరుగారిని ప్రభువులు కోటలోనికి తీసుకొని వెళ్ళి అద్భుతంగా అలంకరింపబడిన మోతీమహాలులో గొప్పగా గౌరవించి స్వాగతపత్రం సమర్పించారు.

తరువాత ముఖ్యులైన శ్రీరామావతారం గారు మున్నగు విద్యాధికులకు పరిచయం చేయబడ్డారు, గవర్నరు గారు. ఆవిధంగా పరిచయ భాగ్యాన్ని పొందగలిగినవారు అయిదారుగురి కంటె యెక్కువమంది లేరు.

ఆ మర్నాడు పూలతోటలో గవర్నరుగారికి గొప్ప విందు చెయ్యబడినది. దానికి నూరుమందికి పైగా పుర ప్రముఖులూ, రాజబంధువులూ, ఉద్యోగస్థులూ ఆహ్వానింపబడ్డారు.

ఆ విందుకు ముందుగానే ప్రభువులు గవర్నరుగారి చేతికి ఒక ప్రోగ్రాము కాగితం అందించారు. దాన్ని

ఆయన చూచుకుని 'మాకు మీరు పంపించిన ఒరిజినల్ ప్రోగ్రాములో కంటే యిందులో ఒకటి ఎక్కువగా వున్నట్లు తోస్తున్న దే! బహుశా యిది యీ దరిమిలాను చేర్చబడి వుంటుంది" అని నవ్వుతూ అన్నారు.

ప్రక్కనే వున్న రామావతారంగారు వెంటనే అందుకుని "చిత్తం, చిత్తం. ఒకటి మాత్రం యిందులో అదనంగా చేర్చబడింది. దాన్ని గవర్నరు ప్రభువులు ఆమోదిస్తారనే ధైర్యంతోనే చేర్చాము. ఇక్కడ స్వార్థత్యాగీ, దేశసేవాపరుడూ, ఉదారుడూ, ఉత్తముడూ అయిన పేర్ల-రామమూర్తిసెట్టి అనే వర్తకుడున్నాడు. అతనికి తమ యెడల హద్దులేని భక్తిగౌరవాలు! ప్రభువులు ఈ వూరికి విజయం చేస్తున్నారని తెలిసి, తమ పేరట నగరవాసుల ఉపయోగంకోసం ఒక గ్రంథాలయాన్ని పబ్లిక్ పార్కులో ఈ మధ్యనే నిర్మించాడు. దానికి ప్రారంభోత్సవం తమరు చెయ్యాలని అతడు మిక్కిలి ఆశపడుతున్నాడు. తమరు మా సాహసానికి క్షమించి, ఆ గ్రంథాలయాన్ని బహిరంగ పరుస్తే, మేమంతా ధన్యుల మౌతాము. తర్వాత ప్రభువుల చిత్తం; అతని భాగ్యం!" అని మనవిచేశారు.

"ఓహో! అలాగా! అయితే దానికి మా అభ్యంతరం యెంతమాత్రమూ లేదు" అని గవర్నరుగారు తమ ఆమోదాన్ని తెల్పారు.

విందూ, దానికి అనుబంధాలైన వినోదాలూ, ఉప

న్యాసమూ అయాక గవర్నరుగారి కారు పార్కులోకి మళ్ళి నది; మహారాజులుంగారూ, రామావతారంగారూ కూడా ఆయన వెంట ఉన్నారు.

పార్కులో చెరువుకు పడమటివైపున కొత్తగా నిర్మింపబడిన 'వెస్‌లక్ గ్రంథాలయం' చాలా చక్కగా అలంకరింపబడినది. ఆ భవనపు ఆవరణ ద్వారం దగ్గర స్వాగత తోరణాలు ఆంగ్లభాషలోనూ, ఆంధ్రంలోనూ రెపరెపలాడుతూ ప్రకాశిస్తున్నాయి.

అక్కడనే రామమూర్తి సెట్టిగారు ఆప్తులతోనూ, మిత్రులతోనూ గవర్నరుగారి రాకకు ఎదురుచూస్తూ నిలిచి వున్నారు. ఇంతలో గవర్నరుగారూ, ప్రభువులూ, రామావతారంగారూ కారులు దిగి, స్వాగత తోరణాన్ని సమీపించారు.

రామమూర్తి సెట్టిగారు ముకుళిత హస్తాలతో ఎదురుగా రాగా రామావతారంగారు ఆయన్ని గవర్నరుగారికి పరిచయం చేశారు. గవర్నరుగారు మందహాసంతో రామమూర్తి సెట్టిగారికి షేక్‌హాండు ఇచ్చారు. ఆ గౌరవానికి సెట్టిగారు పొంగిపోయారు.

తర్వాత ఆయన గవర్నరుగారి ప్రక్కగానే నడుస్తూ భవనద్వారం దగ్గరకి ఆయనను తీసుకువచ్చారు.

గవర్నరుగారు భవనద్వారానికి అడ్డంగా కట్టివున్న రిబ్బనును కత్తిరించి లోపల అడుగుపెట్టిన వెంటనే సెట్టి

గారు ఆయన మెడలో పూలమాల వేసి, లోపలకు తోడ్కొని వెళ్లారు. అందరూ కూర్చున్నతర్వాత స్వాగతపత్రం చదివారు. అందులో గవర్నరుప్రభువు చేసిన, చేస్తూ వున్న కార్యాలన్నీ పేర్కొనబడినవి. గవర్నరుగారూ చాలా సంతోషించి, రామమూర్తి సెట్టిగారి గుణగణాలను పొగడుతూ, పౌరుల శ్రేయస్సు కోరి, ఆయన స్థాపించిన యీ గ్రంథాలయం దినదినాభివృద్ధి పొందాలని దీవించారు.

రామమూర్తి సెట్టిగారి ఆనందానికి హద్దు లేదు!

కేవలం గవర్నరుగారి కరస్పర్శకోసమూ, సాధారణ పరిచయంకోసమూ తహతహలాడిన సెట్టిగారికి – అంతకంటే ఎన్నో రెట్లు అధికగౌరవమే కలిగినది. గవర్నరుగారు సెట్టిగారిని కొనియాడినట్లు మరెవ్వరినీ కొనియాడలేదు.

ఇది రమారమి అరవైయేళ్ల క్రిందట జరిగిన సంఘటన: ఆ వెన్‌లక్ లైబ్రరీ యిప్పటికీ శక్తివంచన లేకుండా మునిసిపాలిటీవారి ఆధ్వర్యంక్రింద సేవచేస్తూనే వున్నది.



---

# 9. కృతజ్ఞత

లక్ష్మోజీ పండితులు విజయనగరాధీశులైన ఆనంద గజపతి ప్రభువులకు విద్యాగురువులు. ఆయన బోధించేది ప్రధానంగా ఆంగ్లమైనా - ప్రతిభాశాలి అయిన ఆయన ప్రభువుకు పెక్కు భాషల్లో పాండిత్యం కలిగేటట్టు చేశాడు. గ్రీకు, లాటిన్ భాషలూ, సంస్కృతమూ కూడా ప్రభువు ఆయన దగ్గరే అభ్యసించడం జరిగినది.

ఎక్కడ ఏకొత్త పుస్తకం - ఉపయుక్త మయినది. ప్రకటితమయినా ప్రభువులదృష్టి దానిమీద పడేది. వెంటనే దాని ప్రతులు రెండు వచ్చేవి ఒకటి గురువుగారికీ, మరొకటి శిష్యునికిన్నీ, పాఠం చెప్పడానికి గురువుకు పుస్తకం కావాలి. అభ్యసించడానికి శిష్యుడికి దాని అపేక్ష వుందని వేరే చెప్పనక్కరలేదు. ఈ విధంగా ప్రభువుల గ్రంథాలయంతో పాటు లక్ష్మోజీపండితుల గ్రంథాలయం కూడా పెరిగిపోయింది ప్రభువుల ఖర్చుతో.

ఈ విధంగా ఇంగ్లీషు, గ్రీకు, లాటిను భాషల గ్రంథాలతో పాటు సంస్కృత గ్రంథాలూ, ప్రాకృత గ్రంథాలూ కూడా వారి గ్రంథాలయాల్లో తగిన స్థానం ఆక్రమించుకున్నాయి.

ఒకనాడు గురువుగారు ఒక సంస్కృత కావ్యం గురించి చెపుతూ, సందర్భానుసారంగా ప్రాచీన భారతీయ

వాఙ్మయ తత్వాన్నిగురించి ఎక్కువగా చెప్పవలసి వచ్చింది. ప్రభువుల ప్రశ్నపరంపరకు సమాధానం యిస్తూ, ఆ సమయంలోనే ఆయన అత్యంతప్రాచీనమైన ఋగ్వేదాన్ని గురించి చెపుతూ - దానికి విద్యారణ్యులువారి భాష్యం అమోఘమైనది వున్నదనీ, పాశ్చాత్యులు కూడా దాన్ని ఎక్కువ ప్రశంసిస్తారనీ లక్ష్మాజీపండితులు తెలియజెప్పినారు.

అప్పుడు ప్రభువు "సంస్కృత వాఙ్మయాన్ని పాశ్చాత్యులు మెచ్చుకున్నారంటే అర్థం వున్నది. వైదికవాఙ్మయాన్నీ మెచ్చుకున్నారని మీరంటున్నారు. ఇది గమనింపదగినదే!" అన్నారు.

లక్ష్మాజీ: మెచ్చుకోవడమే కాదండి. అందులో అపారమైన కృషిచేసిన విద్వత్ప్రకాండులూ వున్నారు. వారిలో శార్మణ్యదేశీయుడు - మోక్షమూలరభట్టు ముఖ్యుడు" అంటూ చిరునవ్వు నవ్వారు.

ప్రభువు: గురూజీమాటలు ఈ దినం చాలా వింతగా వినబడుతున్నాయి. నే నెరిగినంత వరకూ - ప్రపంచంలో శార్మణ్యదేశం అంటూ ఒక దేశం కానరాదు. మోక్షమూలరభట్టు - అనే పేరుకూడా చాలా విచిత్రంగా కనబడుతున్నది.

లక్ష్మాజీ : కొన్ని మనకు వింతగానే మొదట్లో కనబడతాయి. క్రమంగా ఆలోచించి చూస్తే - అలాంటివాటిలో వింత ఏమీ కనబడదు. ఆ భట్టుగారు గోతీర్థ

నివాసి కూడాను.

ప్రభువు : గోతీర్థమా ? రాజమండ్రిదగ్గర కొవ్వూరు గోపాదక్షేత్రమని వింటూవున్నాము. ఈ తీర్థంసంగతి కొత్తగా వుంది.

లక్ష్మాజీ : ప్రభువులు చిత్తగించాలి! నేను పాశ్చాత్య విద్వాంసుల సంగతిని గురించే మనవి చేస్తున్నాను. ఈ మధ్యను ప్రభువులతో కూడా నేను చెన్నపట్నం వచ్చినప్పుడు ఒకనాడు తీరిక చేసుకుని యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్లాను. పుస్తకాలు తిరగవేస్తూ వుండగా నాకు ఒక అపూర్వగ్రంథం లభించినది. అది విద్యారణ్య భాష్యంతో వున్న ఋగ్వేదం! అది చాలా చక్కగా ముద్రించబడి వుండినది.

ప్రభువు : వేదాలను అచ్చువేసి వుంచడం మనవారి సంప్రదాయం కాదుగదా! అది భాష్యంతో కూడా అచ్చుకావడం చాలా వింతగా వున్నదే!

లక్ష్మాజీ : చిత్తం, చిత్తం. మనవారైతే అచ్చువేసి వుండరు. అది పాశ్చాత్యదేశంలోనే ముద్రితమయినది! జర్మనీదేశంలో పుట్టిన గొప్ప విద్వాంసుడు - మాక్సుముల్లరు అనే ఆయన దాన్ని చాలా చక్కగా సంస్కరించి అచ్చువేయించాడు.

ప్రభువు : (నవ్వుతూ) ఓహో! ఇప్పుడు మీ అభిప్రాయం బోధపడింది. జర్మనీ దేశాన్నే మీరు శారణ్య

దేశం అన్నారు. మాక్సుముల్లరు దొరనే మోక్షమూలర భట్టు అన్నారు కదూ!

లక్ష్మాజీ: నేను అనడం కాదండి! ఆయనే ఆ మహా గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ, దాని చివరను యీ పేర్లు వ్రాసుకున్నాడు. మోక్షమూలాన్ని గ్రహించేవాడు కావడం చేత అతని పేరుకూ, మోక్షమూలరభట్టనే సంస్కృతీకరణం చాలా చక్కగా అతుక్కు పోయింది!

ప్రభువు: మరి గోతీర్థమనేది ఏమిటి?

లక్ష్మాజీ: ఆయన ఆక్సుఫర్డు యూనివర్సిటీలో సంస్కృతశాఖకు అధ్యక్షుడు. అందువల్లనే గోతీర్థనివాసి అయ్యాడు.

ప్రభువు: యీ పేర్లనుబట్టే ఆయన ఉద్దండుడుగా కనిపిస్తున్నాడు. ఆయన పరిష్కరించి ప్రకటించిన గ్రంథం సర్వోత్కృష్టంగా వుంటుం దనడంలో యేమాత్రమూ సందేహం ఉండదు. ఆ గ్రంథాన్ని వెంటనే మన గ్రంథాలయాలకు తెప్పించండి. ఆ గ్రంథంలోని విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం ఎక్కువగా వున్నది.

లక్ష్మాజీ: ఆపండితుడు దాన్ని స్వంతంగానే అచ్చు వేయించాడు; సజీవుడుకూడాను. ఆయన పేరనే - నేడే జాబు వ్రాస్తాను. తప్పకుండా మనకు గ్రంథాలు లభిస్తాయి!

ఆ కాలంలో యిప్పటివలె రాకపోకలకుగాని, తపాలు పంపడానికిగాని తగిన సౌకర్యాలు లేవు. విదేశాలకు స్టీమర్లు

మీాదనే రాకపోకలు జరిగేవి ; తపాలు పంపబడేది.

ప్రభువులు ఎంత తొందరపడినా మాక్సుముల్లరు దొరవద్దనుంచి సమాధానం రావడానికే రెండు నెలలు పయిగా పట్టినది. ఇంతకూ అతడు వెంటనే సమాధానం వ్రాశాడు కూడా.

సమాధానమైతే వెంటనే వచ్చింది. కాని అది గురు, శిష్యు లిద్దరికీ చాలా నిరుత్సాహాన్ని కలిగించినది.

తనదగ్గర తన సొంతప్రతి తప్ప మరి ఒక్క ప్రతి కూడా ఎక్కువగా లేదనీ, ఆ గ్రంథాన్ని పంపలేనందుకు చాలా విచారిస్తున్నాననీ ఆ దొరగారు సమాధానం యిచ్చారు.

సాధారణంగా జనసామాన్యానికి కూడా దొరికే వస్తువులమీాద అనాదరణా, దుర్లభమైన వాటిమీాద ఎక్కువ ఆసక్తి - వాటిని సంపాదించవలెననే పట్టుదలా వుంటుంది. ఇక మహారాజుల సంగతి చెప్పనక్కరలేదు. ఋగ్వేదభాష్యం ప్రతి దుర్లభమని తెలియడంతోనే దాన్ని ఎలాగయినా సంపాదించి తీరాలనే పట్టుదల కూడా ఆయనకు ఎక్కువ అయినది. ఆ విషయంలో ఎంత ధనం వ్యయం చెయ్యడానికయినా ఆనందగజపతి ప్రభువు సంసిద్ధుడయి వున్నాడు. ఉంటే మాత్రం ఆ గ్రంథం దొరకే మార్గం ఎట్లా?

* * *

మాక్సుముల్లరుదొర గొప్ప ప్రతిభాశాలి. భారతీయ సాహిత్యంతో పాటు భారతీయుల ఉదారహృదయాన్ని

కూడా పూర్తిగా ఆయన అవగాహన చేసుకోగలిగాడు.

ఆనంద గజపతి ప్రభువులవద్దనుంచి ఋగ్వేద భాష్య ప్రతులకోసం ఆర్డరు రాగానే - అతనికి విచారమూ, ఆ విచారంతో పాటు ఒక ఆశా కూడా కలిగాయి! తాను ఎలాగూ ప్రతిని పంపగలిగిన స్థితిలో లేడు. "మళ్ళీ దాన్ని అచ్చువేసి పంపగల" నని జబాబు వ్రాయడానికయినా - అతడు తిరిగి అచ్చు వేయించే స్థితిలో లేడు. విద్వాంసులకు సహజసిద్ధమైన దారిద్ర్యం అతనిని విడిచిపెట్టగలదా? లేదు. తొలిసారి అచ్చు వెయ్యడానికే బోలెడంత ఖర్చయినది. అందుకోసం ఎంతో సొమ్ము అప్పుచెయ్యవలసి వచ్చినది. ప్రతులన్నీ చెల్లిపోయినా పెట్టుబడిసొమ్ము రాలేదు. అప్పు కొంత మిగిలిపోయినది. ఋణదాతలవల్ల ఒత్తిడికూడా కలుగుతున్నది. కానైతే - అతనికి మరోముద్రణం వేయించాలనే కోరిక లేకపోవడం లేదు. వెనకటికంటె కూడా ఎంతో ఆకర్షణీయంగా అచ్చువేయించాలని కూడా కుతూహలం ఉన్నది. కాని అట్టి ఆకాశహర్మ్యం నిర్మాణంవల్ల ప్రయోజనం ఏమి వుంటుంది?

ఇలాటి కోరికలు మనస్సులో జీర్ణించిపోతూ వున్నా - మహారాజులుంగారి జాబువల్ల కొంత ఆశకూడా అంకురించినది. తన గోడు అంతా వివరంగా వెళ్ళబుచ్చి ఆర్థిక సహాయం అభిలషించే పక్షంలో కొంతవరకయినా సహాయం కలుగవచ్చుననీ, కాగితం కొనడానికయినా ఆ ప్రభువు విరా

శమిస్తే అచ్చుఖర్చులకు వేరే తంటాలు పడవచ్చుననీ ఆశ కలిగినది. అతడు వెంటనే తన పరిస్థితుల నన్నింటినీ తెలియజేస్తూ, ఉదారుల సహాయం వుంటేనేగాని ద్వితీయముద్రణకు అవకాశం వుండేటట్లు కనిపించదని ఎంతో వినయవిధేయతలతో మనవి చేశాడు.

ఆనంద గజపతి ప్రభువు గొప్ప ఉదారుడనీ, కవిపండితులకు పట్టుగొమ్మ అనీ, అభినవ విద్యాభోజుడనీ అతనికి బాగా తెలుసునో ఏమో!

మాక్సుముల్లరుదొర ప్రకటించిన గ్రంథం లభించాలంటే – అది పునర్ముద్రణ కావాలనీ, లేకపోతే – మార్గాంతరం లేదనీ ప్రభువులకు సుస్పష్టమయినది.

జాబు వచ్చిన ఒకటి రెండు రోజుల్లో కొంత ఆలోచించి – ఆర్థికంగా ఆ విదేశ విద్వాంసుడికి తోడ్పడడానికి ప్రభువులు నిశ్చయించి గురువుగారితో ఇలా అన్నారు—

" గురూజీ! నేడే మాక్సుముల్లరుదొరగారికి జాబు వ్రాయించండి. ఋగ్వేదాన్ని సభాష్యంగా ద్వితీయముద్రణం వేయించడానికి అయ్యే ఖర్చులన్నీ భరించడానికి సంకల్పించాము. దీనికి ఎక్కువ వ్యయం కావచ్చును. కాని మనం ఖర్చుచేసేదానికి ఎన్నో రెట్లు అధికంగా మన కీర్తిప్రతిష్ఠలు వ్యాపిస్తాయి. ఆ ఉత్కృష్ట గ్రంథం ప్రతులు ప్రపంచం యావత్తూ వ్యాపించడంవల్ల వాటితోపాటు మన కీర్తికీ మంచి వ్యాప్తి కలుగుతుంది. ఇండియాలో ఏదో మారు

మూలను వున్న ఒక జమీందారీపాలకులు యిలాంటి ఉత్కృష్ట కార్యానికి పూనుకున్నారని సంతోషిస్తే - అదే మనకి పదివేలు కదూ!''

లక్ష్మాజీపండితుడు ప్రభువుల యీ నిశ్చయానికి ఆశ్చర్య పడ్డాడు, ఆశ్చర్యంతోపాటు ఆనందమూ ఎక్కువగానే కలిగింది అతనికి. ఈ మహోత్కృష్ట కార్యంవల్ల ప్రభువుల కీర్తి ఆచంద్రతారార్కమూ స్థిరంగా వుంటుందని సంతృప్తి కలిగినది కూడా.

''చిత్తం! ప్రభువుల ఆనతిప్రకారం ఆ విధంగానే జాబు వ్రాస్తాను'' అని ఆయన అన్నాడు.

ప్రభువు: ఆయనకు ఎలాంటి అనుమానమూ కలగకుండా వుండేటట్లు జాబు వ్రాయాలి. ఈ ద్వితీయ ముద్రణ సర్వోత్కృష్టంగా వుండడానికి అయ్యే ఖర్చులన్నీ మనమే భరించగలమని తెలపండి. గ్రంథానిపై మనకు ఎలాటి హక్కూ అక్కర్లేదు. గ్రంథ విక్రయంవల్ల లభించే సొమ్ము ఆయనే తీసుకోవచ్చును. గ్రంథం మళ్ళీ ముద్రించబడడమే మనకు ముఖ్యం! ఈసంగతులన్నీ వివరంగా తెలియజేస్తూ, ఎంత ఖర్చు అయేదీ తెలియజేయాలని వ్రాయండి. ఆయన జబాబు చూచుకొని, కావలసిన సొమ్ము వెంటనే పంపించి వేద్దాము.

లక్ష్మాజీ పండిత్తులు ఆరోజు టపాలోనే మాక్సు ముల్లరుదొరకు ఆక్సుఫర్డు యూనివర్సిటీకి జాబు వ్రాశారు.

మాక్సుముల్లరు పండితుడు ఆనందగజపతి ప్రభువు వద్దనుంచి వచ్చే జవాబుకోసం ఎదురుచూస్తూ వుండగా తగిన సమయానికే జాబు వచ్చినది.

ఏదో స్వల్పమొత్తం సహాయం జరగవచ్చునని అనుకొంటూ వుండగా - ద్వితీయముద్రణం సర్వోత్కృష్టంగా ప్రకటించడానికి అయ్యే ఖర్చులు యావత్తూ తాము భరిస్తూ, అధికారాలు గ్రంథసంస్కర్తకే విడిచిపెడుతూ వుండేటట్లుగా వ్రాసిన ఆ జాబు చూచి ఆ పండితుడు ఆనందంతో ఆకాశం అందుకున్నాడు. నాటిరోజులలో విదేశీయవిద్వాంసులను యీ విధంగా గౌరవించే ప్రభువులు యెవ్వరూ, ఎక్కడా వుండరనీ, వదాన్యతలో ఆనందగజపతి ప్రభువునకు ఈడయిన వారు చాలా అరుదనీ అతడు భావించాడు. తన కృతజ్ఞతను తెలుపుతూ, ప్రభువులను కొనియాడుతూ జాబు వ్రాస్తూ, అందులోనే గ్రంథముద్రణానికి అయ్యే ఖర్చును వివరంగా తెలియజేశాడు.

ఇలా జాబు వ్రాస్తూ, ఆ మరుక్షణంలోనే ముద్రణం ప్రారంభించాడు. ముద్రణవ్యయం శీఘ్రంగానే లభించినందుననూ, వెంటనే ఆ సొమ్ము అచ్చుకూటంవారికీ, కాగితానికీ ఇవ్వడంవల్లనూ ముద్రణ అనుకున్న సమయంకంటే చాలా ముందుగానే పూర్తి అయింది. అది సర్వాంగసుందరంగా తయారైనది కూడా. ఈ విధంగా మహోపకారం చేసి తన గ్రంథం తిరిగీ వెలువడడానికి ముఖ్యకారణ

మయిన ఆనందగజపతి ప్రభువునకు తన హృదయపూర్వక మైన కృతజ్ఞతను ఏ విధంగా తెలుపవలెనో మాక్సుముల్లరు దొరకు తోచడం లేదు. కాని చివరకు ఒక ఆలోచన తోచినది.

మాక్సుముల్లరు మొదట్లో ఆ గ్రంథాన్ని విక్టోరియా చక్రవర్తికిని అంకితం చేశాడు. ఈ ద్వితీయ ముద్రణను ఎడ్వర్డుచక్రవర్తికి అంకితం చెయ్యాలని ఆయన అభిలాష! అలా చెయ్యడంలో ఒక ఆలోచన తట్టి - తానూ, ఆనంద గజపతిప్రభువూ కలిసి యీ ద్వితీయముద్రణాన్ని ఎడ్వర్డు చక్రవర్తికి అంకితం యిచ్చినట్లు ముఖపత్రంలో ప్రకటించాడు. దీనివల్ల చక్రవర్తి హృదయంలో కూడా ఆనంద గజపతి ప్రభుని పేరు స్థిరనివాసం ఏర్పరచుకొన్నది.

ఇంతకంటే మాక్సుముల్లరు చేయదగిన ప్రత్యుపకారం వుండదు. ఈ విధంగా చేసి ఆయన ఆనందగజపతి ప్రభువు యెడ తనకు ఉన్న 'కృతజ్ఞత'ను వెల్లడించాడు.

శ్రీ వేమన గ్రంథాలయము,
లేపాక్షి. (కృష్ణా జిల్లా.)

———

Printed at Swathantra Press, Madras - 2.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B174 |
| పుస్తకం పేరు | గజపతులనాంటి |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | , 108 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |